# వేంకటాద్రిపై వేదనాదం

24 జనవరి 2016 న
శ్రీవారి పున్నమిగరుడ సేవ సందర్భంగా
తిరువీథులలో
ఎనిమిది రాష్ట్రాల నుండి వచ్చిన
సుమారు 1500ల మంది
వేదపారాయణ పండితులు
ఋగ్వేదం, యజుర్వేదం,
సామవేదం, అధర్వణవేదాలతో
చతుర్వేదపారాయణం పఠించారు.
ఈ విశేషసేవను తి.తి.దే.వారు
మొదటిసారిగా నిర్వహించారు.
తి.తి.దే.అధ్యక్షులు,
కార్యనిర్వహణాధికారి మరియు
ఉన్నతాధికారులు పాల్గొన్నారు.





# పూలతో ఆరాధించడం పుష్పయాగమే!





పూజలందరు జేసేదే పుష్పయాగము
ఆజి నర్జునుడు జేసినది పుష్పయాగము.

మొదల శ్రీ సతిచేతి మోహనకమలమే
పొదల నీ కెపుడును పుష్పయాగము
గుదిగొన మిమ్ముద్దరి కూడించే మరువిరులు
పొదిగి పూజించిన పుష్పయాగము.

మాలాకారుం డిచ్చిన మధురలో పూదండ
పోలింప నీకు నదె పుష్పయాగము
కేలితో నారదు డొసగిన పారిజాతము
భూలోకమున నీకు పుష్పయాగము.

తొరలి అలమేల్మంగ తురుమున విరులె నీకు
పొరసి నీ వురముపై పుష్పయాగము
సిరులతో మునులెల్ల శ్రీవేంకటాద్రిమీద
పొరిపొరి జేసేరు నీకు పుష్పయాగము.

*(సంపుటం.26, సంకీర్తన.207)*

భక్తులందరూ స్వామిని పూలతో పూజిస్తారు. అలా పూలతో పూజించడమే ఒక యాగం. యుద్ధభూమిలో అర్జునుడు శరణాగతి పొందడానికి మాట్లాడిన మాటలే పుష్పాలు. మాట్లాడడమే పూలతో చేసే పూజ. అలమేలుమంగమ్మ చేతితో విలాసంగా ధరించినకమలం స్వామికి మోహం కలిగించే పుష్పం. ఆ పుష్పం ఎల్లప్పుడూ ఆయనకు మోహం కలిగిస్తూ ఉండడమే యాగఫలం. అమ్మవారికి, స్వామివారికి మరులు కలిగించే విరులతో అర్చించడమే పుష్పయాగం.

మధురలో బాలకృష్ణునికి మాలాకారుడు ఇచ్చిన పూలమాల నీకు చేసిన పుష్పయాగంతో సమానమే! దేవలోకం నుండి నారదమహర్షి తెచ్చి ఇచ్చిన పారిజాతపుష్పం భూలోకంలో నీకు చేసిన పుష్పయాగమే!

అలమేలుమంగ తలలో తురుముకొన్న పుష్పాలు నీ ఎదపై అలంకరించిన పుష్పాలే! మహర్షులు నీకు తిరుమలలో పూలతో ఆరాధించడం పుష్పయాగమే!



## ఎలా చెప్పాలి?

కొత్తరూపురేఖలు సంతరించుకొని డిసెంబరు, 2015 నుంచి వస్తున్న **'సప్తగిరి'** మాసపత్రిక మాకు చాలా సంతోషం కల్గిస్తున్నది. వ్యాసాలు, చిత్రాలు.... ఒక్కటేమిటి అన్నీ బాగుంటున్నాయి.

డిసెంబరు మాసపత్రిక రూపకల్పనకే ఎంతో ముచ్చటబడిన నేను, ఉన్నట్లుండి జనవరి మాసంలో రంగులలో సప్తగిరి రావడం చూసి ఒక్కసారిగా ఆశ్చర్యపోయాను.

రంగులవిషయం అలా ఉంచి, ఆండాళ్ తల్లి పాశురాలకు భావకవితాచక్రవర్తి దేవులపల్లి కృష్ణశాస్త్రి గేయానువాదాలు, వాటికి ప్రముఖ చిత్రకారుడు బాపు తమ చిత్రాలతో ఎత్తిన మంగళహారతులు కనువిందును కల్గించాయి. ఎన్నో సంవత్సరాల తర్వాత కృష్ణశాస్త్రి పాటలను మళ్లీ 'సప్తగిరి' ద్వారా చదవగలిగాను. ఇది కేవలం ఏడుకొండలవాడి కరుణ తప్ప మరొకటి కాదు. శ్రీవైష్ణవ సాహిత్యాన్ని, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడి దివ్యవైభవాన్ని తీరుతీరులుగా దినదినప్రవర్ధమానంగా అందిస్తున్న మీ చిత్తశుద్ధిని మాటల్లో ఎలా చెప్పను?

ఒక గ్రీటింగ్ కార్డు అరవై రూపాయలు ఖరీదు ఉన్న ఈ రోజుల్లో కేవలం ఒక పోస్టు కవరు ఖరీదు అయిన ఐదు రూపాయలకే సప్తవర్ణ శోభితమైన 'సప్తగిరి'ని భక్తలోకానికి అందుబాటులోకి తెస్తున్నారు.

ప్రస్తుతం అన్ని రంగాల్లోనూ ధరలు రోజురోజుకు అంతకంతకు పెరుగుతున్న ఈ రోజుల్లో దశాబ్దాల నుంచి తి.తి.దేవస్థానం సప్తగిరి ధర పెంచకుండా పత్రిక అందజేయడం ఆనందదాయకం. మరొకమారు పత్రికాసిబ్బంది చిత్తశుద్ధికి ధన్యవాదాలు.

*- మోదుగుల రవికృష్ణ, గుంటూరు.*

## వెల్లువ!

**'సప్తగిరి'** మాసపత్రిక జనవరి నెల నుండి రంగులలో, ఆకర్షణీయమైన చిత్రాలతో, సరికొత్త శీర్షికలతో, ప్రముఖుల విశేషవ్యాసాలతో సంచిక దాచుకోదగ్గ రీతిలో ఉందని, ఇలా వెలువడుతున్నందుకు చాలా సంతోషంగా ఉందని, తిరుమల శ్రీవారే తమ ఇంటికి నడిచివచ్చినట్లుందని దేశవ్యాప్తంగా అశేషపాఠకులు మా కార్యాలయానికి అభినందనలు ఉత్తరాలు, ఫోన్లద్వారా తెలియజేశారు.

వారందరికీ పేరుపేరునా మా ధన్యవాదాలు. పాఠకుల ఆదరాభిమానాలే పత్రికల మనుగడకు శ్రీరామరక్ష! అందుచేత పత్రిక ముమ్ముందు మరింత ఆకర్షణీయంగా, ఆలోచనాత్మకంగా వెలువరించి పాఠకలోకం అభిమానాన్ని చూరగొనడానికి కృషిచేస్తుందని మనవి చేసుకుంటున్నాం.

*- ప్రధాన సంపాదకుడు*

## 2016 ఏప్రిల్ నెల ఉత్సవాలు, పండుగలు

**ఏప్రిల్ 03 నుండి ఏప్రిల్ 12 వరకు**
శ్రీకోదండరామస్వామివారి బ్రహ్మోత్సవాలు

| | |
|---|---|
| 4 | శ్రీఅన్నమాచార్య వర్ధంతి |
| 8 | ఉగాది |
| 9 | మత్స్యజయంతి |
| 11 | శ్రీకోదండరామస్వామివారి రథోత్సవం. |
| 13 | వాయల్పాడు శ్రీపట్టాభిరామస్వామి బ్రహ్మోత్సవాలు ప్రారంభం |
| 15 | శ్రీరామనవమి |
| 16 | శ్రీకోదండరామస్వామివారి కల్యాణోత్సవం |
| 17 | శ్రీకోదండరామస్వామివారి పట్టాభిషేకం |

**ఏప్రిల్ 19 నుండి ఏప్రిల్ 21 వరకు**
తిరుమల వసంతోత్సవాలు

**ఏప్రిల్ 19 నుండి ఏప్రిల్ 21 వరకు**
శ్రీకోదండరామస్వామివారి తెప్పోత్సవాలు

| | |
|---|---|
| 22 | నాగులాపురం, శ్రీవేదనారాయణస్వామి బ్రహ్మోత్సవాలు ప్రారంభం |

# సప్తగిరి

**తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక**

సంపుటి 46 | మార్చి 2016 | సంచిక 10


## ఈ నెలలో....



**ముఖచిత్రం :** అదుగో కొలువై యున్నాడు - అలమేలుమంగపతి

**వెనుకచిత్రం :** వేవేలు మొక్కులు లోకపావని నీకమ్మా

వేంకటాద్రిసమం స్థానం
బ్రహ్మాండే నాస్తి కించన।
వేంకటేశసమో దేవో
న భూతో న భవిష్యతి ॥


**గౌరవ సంపాదకుడు**
డా॥ డి. సాంబశివరావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు.

**పర్యవేక్షకుడు**
శ్రీ ఎన్.ముక్తేశ్వరరావు, ఐ.ఏ.ఎస్.(విశ్రాంత),
ప్రత్యేకాధికారి, ప్రాజెక్టులు, తి.తి.దే.

**ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు**
డా॥ సి.శైలకుమార్

**సంపాదకుడు**
డా॥ కె.రాధారమణ

**ఉపసంపాదకుడు**
డా॥ కంపల్లె రవిచంద్రన్

**ముద్రాపకుడు**
శ్రీ వి.వీరబ్రహ్మయ్య, ఎం.ఏ., బి.ఇడి.,
ఉపకార్యనిర్వహణాధికారి(ప్రచురణలు & ముద్రణాలయం),
తి.తి.దే., తిరుపతి

**వర్ణ చిత్ర పుటలు**
పి.శివప్రసాద్

**పుటలు రూపకల్పన**
బి.గురుకుమార్ రెడ్డి

సప్తగిరి మాస పత్రిక

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ. 500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-



# యత్ర నార్యస్తు పూజ్యంతే..

భారతదేశం స్త్రీని దేవతగా, మాతృమూర్తిగా, సోదరిగా, గృహిణిగా, సహధర్మ చారిణిగా అనేకవిధాల గౌరవాదరాలకు పాత్రురాలుగా భావించింది. స్త్రీకి సమున్నత స్థానాన్ని చేకూర్చింది. భారతదేశవిశిష్టతలలో స్త్రీగౌరవం ప్రపంచానికే ఆదర్శవంతమైంది. మనువు "యత్ర నార్యస్తు పూజ్యంతే; రమంతే తత్ర దేవతాః"- ఎక్కడ స్త్రీలు గౌరవించబడుతారో అక్కడ దేవతలు ఆనందంగా విహరిస్తుంటారని భారతీయుల విశిష్టమనోధర్మాన్ని, సంప్రదాయాన్ని నొక్కి వక్కాణించాడు.

స్త్రీలు కుటుంబనిర్వహణలో ప్రథమపాత్ర వహిస్తారు. యజ్ఞయాగాదులలో సతీమణి ప్రక్కన ఉన్నప్పుడే ఆ పురుషునికి యజ్ఞనిర్వహణాధికారం వస్తుంది. అందుకే రాముడుకూడా అశ్వమేధయాగసమయంలో సువర్ణసీతను పెట్టుకొని ఆ యాగాన్ని నిర్వహించాడు. సృష్టికి స్త్రీ మూలకారణశక్తి. స్త్రీలను గౌరవించేదేశం సకలసౌభాగ్యాలతో వర్ధిల్లుతుంది. మానవధార్మిక సుఖమయజీవనానికి సంకేతం విష్ణుతత్త్వం. ఇహపరసుఖానికి, పరమపదప్రాప్తికికూడా ఇదే సంకేతం. అష్టప్రకృతులకు సంకేతం అష్టలక్ష్ములు. వారిఏకాత్మకస్వరూపం మహాలక్ష్మి. ఆమెకు వక్షఃస్థలమిచ్చి 'నా హృదయమే ఆమె' అనే గొప్పసందేశాన్ని శ్రీమహా విష్ణువు లోకాని కందించాడు. బ్రహ్మ సరస్వతిని తన ముఖమునందుంచుకుని నాలోని పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అనే చతుర్విధవాక్స్వరూపాలూ నా భార్యరూపాలే అని లోకానికి 'భార్యను వాగ్దేవతగా గౌరవించండి' అనే సందేశా న్నందించాడు. శివుడు పార్వతిని తన వామభాగంగా చేసుకొని, నా శరీరంలోని అర్ధం నా భార్యయే కనుక 'భార్యకు అర్ధాంగి' అనే పేరు నేను ఏర్పాటు చేస్తున్నానని మరో విధమైన గొప్పసందేశాన్ని మానవాళి కందించాడు.

ఈ విధంగా త్రిమూర్తులుసైతం స్త్రీని తమ జీవితభాగస్వామినిగానే గాక తమ హృదయమూ, వాక్కూ, శరీరమూకూడా ఆమెశక్తివల్లనే చైతన్యవంతాలవుతున్నాయని నిరూపించారు. ధర్మబద్ధమైన తృతీయపురుషార్థంమాత్రమే భగవత్స్వరూపమౌతుందని గీతాచార్యుడు ప్రబోధించాడు కనుక ఈ విషయాన్ని మరచి, స్త్రీని మరొకవిధంగా భావించే పాశవికప్రవృత్తి మానవాళిలో ఏర్పడడం దురదృష్టకరం. ధర్మపత్ని, సహధర్మచారిణి అనే పదాలు పురుషుని ధర్మనిర్వహణలో స్త్రీపాత్ర ఎంత ప్రబలమైందో, విశిష్టమైందో నిరూపిస్తున్నాయి. అందుకే వాల్మీకి రామాయణంలో రామునికి సీతను అప్పగించే సమయంలో జనకునిచేత "సహధర్మచరీ తవ" - నీవు నిర్వహించే అన్నిధర్మకార్యాల్లో నీ వెంట ఉండి, నిన్ను చైతన్యపరుస్తుంటుంది' అని కన్యాదానంచేసిన సన్నివేశం మానవజాతి అనుక్షణం స్మరింపదగింది.

సర్వత్ర భారతజాతి స్త్రీని ఒక వ్యక్తిగా గాక సమాజస్ఫూర్తి నిచ్చేశక్తిగా భావించి, గౌరవించింది. ఎంతో ఉదాత్తభావాన్ని పొందిన స్త్రీమూర్తిని కించ పరచకుండా సంయమనశీలం, ధార్మికభావన ఆవగింజంతైనా అలవరచుకుని జీవించగలిగితే అదే ఈ అనంతస్త్రీచైతన్యశక్తికి మనమిచ్చే నిజమైన ఆనంద నీరాజనం! మనిషిలోని రాక్షసత్వాన్ని, పశుప్రవృత్తిని నియంత్రించడానికి ధార్మిక, ఆధ్యాత్మికస్ఫూర్తి రక్తంలో జీర్ణించి ఉండడం ఎంతైనా అవసరం.

**తరుణి పెదవిపై చిరునగవొలికిన మెరయును ముత్యాలసరులు!**
**కలకంఠి కంట కన్నీరొలికిన తొలగిపోవును సిరులు!!**



శివరాత్రి యోగరాత్రి. తక్కిన పండుగలు భోగాలకు ప్రాముఖ్యమిస్తే, శివరాత్రి యోగానికి ప్రాముఖ్యమిచ్చే మహాయోగపర్వదినం!

పండుగ

మార్చి 07 మహాశివరాత్రి సందర్భంగా...

# మహేశా! పాపవినాశా!!

డా॥ కంపల్లె రవిచంద్రన్,
98487 20478

**మాఘకృష్ణచతుర్దశ్యాం ఆదిదేవో మహానిశి, శివలింగతయోద్భూతః కోటిసూర్యసమప్రభః**
**తత్కాల వ్యాపినీ గ్రాహ్యా, శివరాత్రివ్రతే తిథిః, అర్ధరాత్రా దధ శ్చోర్ధ్వం, యుక్తా యత్ర చతుర్దశీ ॥**

– అని ఈశానసంహిత.

మాఘబహుళచతుర్దశినాటి అర్ధరాత్రికాలంలో పరమశివుడు కోటిసూర్యకాంతులతో లింగరూపంలో ఆవిర్భవించాడు. కనుక ఈనాటి నడిరాత్రినుండి చతుర్దశి ఉన్నప్పుడే మహాశివరాత్రి! ఈ మాఘమాససంబంధంతోనే ప్రతినెలా బహుళచతుర్దశి 'మాసశివరాత్రి' అని నిర్ణయించబడింది.

మహాశివలింగం గల రాత్రి లేదా మహాశివునియొక్క రాత్రి– మహాశివరాత్రి. శివుడంటే బ్రహ్మానందస్వరూపుడు, నిర్వికారుడు గనుక శమించేవాడనీ, ఇతనియందు సజ్జనుల మనస్సులుంటాయనీ, సాధువుల మనస్సులందు శయనించి ఉండేవాడనీ, సకలశుభాలతో కూడినవాడనీ అర్థాలు! శివమంటే మంగళం, శుభం, కైవల్యం, శ్రేయస్సు. రాత్రి అంటే సుఖాన్ని ఇచ్చేది. కనుక గొప్పదైన శుభంతో కూడిందీ, సుఖాన్ని ఇచ్చేదీ, మహాశివస్వరూపమైన బ్రహ్మానందాన్ని ప్రసాదించేదీ, మహాశివరాత్రి.

పరమేశ్వరుడు లింగరూపంలో ఆవిర్భవించినరాత్రి శివరాత్రి గనుక ఆ లింగోత్పత్తి విశేషాలు గమనిద్దాం – ఈ లింగోద్భవసన్నివేశం పద్దెనిమిదికల్పాల్లో – ఈశానకల్పంలో జరిగింది.

ఒకప్పుడు విష్ణువూ, బ్రహ్మదేవుడూ శివమాయాప్రభావంతో మోహితులై, 'నేనే గొప్ప! నేనే గొప్ప!!' అంటూ వాగ్వాదం పెంచుకొని, చివరకు ఇరువురూ ఒకరిపై ఒకరు మహాస్త్రాలు ప్రయోగించుకోవడానికి సిద్ధమైనారు. ఇంతలో ఆ ఇరువురిమధ్య ఆదిమధ్యాంతాలు లేని లింగాకారంలో ఒక మహాతేజోరూపం సాక్షాత్కరించింది. ఆ రూపాన్ని చూడగానే ఇద్దరూ కలహం మాని, ఆశ్చర్యంతో ఈ రూపం ఏమిటో, దీనిఆద్యంతాలు ఎక్కడో, తెలుసుకోవాలని, బ్రహ్మ హంసరూపాన్నీ,

"జన్మకొక శివరాత్రి" అని సామెత. కనీసం జీవితకాలంలో ఒక్క శివరాత్రి రోజైనా శివపూజలూ, జాగరణం చేసి, పరమేశ్వరునిదయకు పాత్రులయినా చాలు - జన్మ తరిస్తుందనే శివరాత్రిరహస్యాన్ని ఈ సామెత సూచిస్తుంది.

జాగరణమనగానే ఏదో పిచ్చాపాటిమాటలతో, వినోద కార్యక్రమాలతో మేల్కోవడం కాదు. ప్రకృతిలో నిద్రాణమై ఉన్న శివశక్తిని, శివపూజా భజనలీలా శ్రవణాదులతో మేల్కొల్పి, తాను శివుడై, సర్వాన్నీ శివస్వరూపంగా భావించి, దర్శించాలి. అపుడే జాగరణ సార్థకమౌతుంది.

విష్ణువు శ్వేతవరాహరూపాన్ని ధరించారు. బ్రహ్మ శిరస్సు చూచి వస్తానన్నాడు. విష్ణువు పాదభాగం చూచి వస్తానన్నాడు. ఎంతదూరం వెళ్లినా, ఇరువురూ ఆ తేజోరూపంయొక్క ఆద్యంతాలు చూడలేకపోయారు.

ఈ సందర్భంలో శ్రీమన్నారాయణుడు శ్వేత వరాహరూపం తాల్చినందున ఈ మహాశివరాత్రి నుండి ఈ కల్పానికి శ్వేతవరాహకల్పమనే పేరు వచ్చిందని శివపురాణాలు పేర్కొన్నాయి. ఈనాటికీ మనం సంకల్పంలో “శ్వేతవరాహకల్పే” అంటూ నిత్యమూ శివరాత్రిని పరోక్షంగా స్మరిస్తూనే ఉన్నాం. ఇలా ఒక కల్పానికి కారణమైన మహాశివరాత్రి కాలప్రవాహంలో మహాపర్వంగా, మహాపరతత్త్వంగా నిల్చిపోయింది.

పరమేశ్వరుడు సర్వవ్యాపకుడైనపుడు అతనికి ప్రత్యేకంగా ఒకరూపమంటూ లేదు. అన్నీ తానే! కానీ అందరికీ కన్పించి, అర్చనావకాశం కల్పించాలనే అనుగ్రహంతో పరమేశ్వరుడు సాంబమూర్తిగా ఈ రోజు ఆవిర్భవించాడు. కేవలం జ్ఞానరూపం నిరాకారం. జ్ఞానం తేజస్స్వరూపం. ఆ జ్ఞానతేజస్సే రాశీభూతమై జ్యోతిర్మయలింగంగా సాక్షాత్కరించింది. రూపం కంటికి కన్పించాలంటే జ్యోతిస్సే కావాలి. అందుకే శివుడు మొట్టమొదట జ్యోతిర్లింగమై, పిదప సాంబశివుడై విష్ణుబ్రహ్మలకు గోచరించాడు. ఇలా ఆవిర్భవించిన సమయం అర్ధరాత్రి. సగం రాత్రిలో ఆవిర్భవిస్తేనే జ్యోతిస్సుకు ఎక్కువ ప్రకాశం ఉంటుంది. ఆ రాత్రివేళ పరమశివుడు జ్యోతిర్మయుడై అందరికీ దర్శనమివ్వడంతో, ఆ రాత్రి మహాశివరాత్రిగా రూపొందింది. ఇదే మహాలింగోద్భవదివ్యకాలం!

శివుడు హాలాహలవిషాన్ని మ్రింగి, లోకాన్ని రక్షించిన రాత్రే ‘శివరాత్రి’ అని కొందరంటారు. భవిష్యపురాణం ఈ పండుగను “శివచతుర్దశి”గా పేర్కొనింది. విష్ణుభక్తులకు అనంత పద్మనాభచతుర్దశి ఎలాంటిదో – శివభక్తులకు ఈ మాఘ మాసశివచతుర్దశి అలాంటిది. ఈ శివరాత్రినాడు ఆవిర్భవించిన తేజోలింగరూపాన్నే – శిలాదిరూపాల్లో ఉన్న శివలింగంలోనూ దర్శిస్తూ, “ఆ పాతాళనభస్థ్సలాంత భువన బ్రహ్మాండ మావిస్ఫుర జ్జ్యోతిస్స్ఫాటికలింగమౌళివిలసత్పూర్ణేందువాంతామృతైః” అంటూ రుద్రాభిషేకధ్యానంలో స్మరిస్తున్నాం.

లింగం అంటే సంకేతమనేది సాధారణార్థం. కానీ, శివునిపరంగా – ప్రకృతిలో లీనమై ఉన్న పరమాత్మస్వరూపాన్ని తెల్పేదీ, పొందించేదీ లింగం అని అర్థం! కనుక నిరాకారమై, సర్వవ్యాపకమైన సచ్చిదానందశివస్వరూపం–ఈరోజు సాకారమై, సర్వజనానందకరంగా, నేత్రోత్సవంగా గోచరించిన మహాపర్వదినం! శివరాత్రినాడు విధిగా ఉపవాసముండి, శివపూజలు చేసి, రాత్రికి జాగరణ చేసితీరాలని ధర్మశాస్త్రాలూ, పురాణాలూ చెబుతున్నాయి.

కృష్ణపక్షంలోని చీకటి, జీవుణ్ణి ఆవరించిన మాయాంధకారం. జ్ఞానదాత అయిన పరమశివునికృపవల్ల, జీవుడు ఈ మాయనుండి ముక్తుడై, ఆత్మస్వరూపాన్ని గుర్తించి, సర్వవ్యాపకమైన ఆనందతేజాన్ని శివలింగరూపంలో దర్శించి, జీవన్ముక్తుడు కావాలనే సదాశయంతో, జీవితాన్ని సత్యశివసుందరంగా తీర్చిదిద్ద

ఎంతటి పాపాత్ములైనా శివరాత్రినాడు జరిగే శివపూజను అప్రయత్నంగా చూచినా చాలు- వారిపాపాలన్నీ పోయి, వాళ్లకు శివసాయుజ్యం లభిస్తుందని పురాణాలు సూచించాయి. శివరాత్రిమాహాత్మ్యం అలాంటిది! ఇందుకు సుకుమారుని వృత్తాంతం నిదర్శనం! సుకుమారుడు మహాపాపి ఐనా - శివరాత్రినాడు ప్రసాదాన్ని దొంగిలించేందుకై మేల్కొని, శివపూజను చూచిన ప్రభావంతో తరించాడు.

ఇలాగే, జంతువులవేటకై వెళ్లిన బోయ- ఒక్కో యామంలో ఒక్కో జింక కన్పించి, చెప్పిన ప్రమాణాలు నమ్మి, ఆ జింకలను వదలిపెట్టినందున, ఆ రాత్రి మేల్కొని బిల్వవృక్షం పై నుండి, బిల్వదళాలు త్రుంచి, క్రిందికి వేస్తున్నందువల్ల, ఆరోజు శివరాత్రి కావడంవల్ల, ఆ చెట్టుక్రిందపుట్టలో శివలింగం ఉండడంవల్ల - శివరాత్రిపూజాజాగరణఫలం అతనికి లభించింది. ఇలా లభించిన అప్రయత్నశివరాత్రిఫలంవల్ల, ఆ జింకలు ఆకాశంలో మృగశీర్షానక్షత్రంగా, దానివెనుక ఉండే పెద్దనక్షత్రం బోయనక్షత్రంగా ప్రకాశిస్తున్నాయంటారు. ఈ బోయనక్షత్రాన్నే “యోగతార” అంటారు.



శివరాత్రిరోజు పగలు మహాన్యాసపూర్వకంగా
రుద్రాభిషేకం చేస్తే - ఆయుస్సు వృద్ధి అవుతుంది.
ఆకస్మిక దుర్మరణం రాకుండా -
పూర్ణాయుష్కులై ఉండాలంటే శివారాధన
చేయాలి. శివుడు మృత్యుంజయుడుకదా!

సంవత్సరాని కొక్కమారైనా...
ఉపవాసముండి, రాత్రంతా మేల్కొని,
"శివా! మృత్యుంజయా! పరమేశ్వరా! శంకరా!
నాకు దుర్మరణం లేకుండా చేయు" మని
గాఢభక్తితో శివుణ్ణి ఆరాధించడానికే
ఈ రోజును "శివరాత్రి"గా నిర్ణయించారు.



కోవాలనే శుభాకాంక్షలతో, అలా భావించి, దర్శించి, తరించిన మనపూర్వులు శివరాత్రిని మహాపర్వదినంగా నిర్ణయించారు.

"జాగ్రత్ స్వప్న సుషుప్తిరూపం, అవస్థాత్రయం, ఆత్మ రూపేణ- శివాభిన్నస్వరూపేణ-రాతి- ఆదదాతి- శివరాత్రిః" అని వ్యుత్పత్తి కనుక, ఆధ్యాత్మికతత్త్వానుభూతి నొంది, "శివోఽహం" అనే పరమాద్వైతస్థితి సిద్ధించడమే శివరాత్రిఫలం!

శివరాత్రినాటి పూజా జాగరణాదులవల్ల,

"సారూప్యం తవ పూజనే, శివమహాదేవేతి సంకీర్తనే
సామీప్యం, శివభక్తిధుర్య జనతా సాంగత్య సంభాషణే
సాలోక్యం చ, చరాచరాత్మక తనుధ్యానే భవానీపతే!
సాయుజ్యం, మమ సిద్ధ మత్ర భవతి స్వామిన్!
కృతార్థోఽ స్మ్యహమ్"

అని శివానందలహరిలో (28వ శ్లోకం) ఆదిశంకరులు పేర్కొన్న సారూప్య, సామీప్య, సాలోక్య, సాయుజ్యాలనే చతుర్విధ ముక్తులూ సులువుగా ఇహలోకంలోనే, ఈ దేహంతోనే స్వానుభవం లోకి వస్తాయి. ఈ నాలుగుమోక్షాలనూ శివరాత్రినాడు ప్రత్యక్షంగా సాధించడమే శివరాత్రిజాగరణం! నాలుగుయామాలపూజలతో మనో బుద్ధిచిత్తాహంకారాలు నాలుగూ పరిశుద్ధం కావాలి. ఈ విషయాన్నే "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య వరా న్నిబోధత" అని కఠోపనిషత్తు కూడా బోధిస్తూంది. (1-3-14)

సాధారణంగా మరణాలు శీతకాలంలోనే ఎక్కువ. ఖగోళ రీత్యా శీతకాలం శివరాత్రితో పూర్తవుతుంది. దక్షిణాయనంలో వచ్చే కార్తికమార్గశీర్షాలకు యమదంష్ట్రాకాలమని పేరు. మృత్యుభయం గల శీతకాలంలో మరణించకుండా కాపాడినందుకు కృతజ్ఞతగా శివరాత్రివ్రతాన్ని ఉత్తరాయణప్రారంభంలో ఆచరించాలి.

"ఓం నమ శ్శివాయ" అనే పంచాక్షరీమంత్రం దుర్మరణం రాకుండా కాపాడే మహాశక్తి గలది. జ్యోతిశ్శాస్త్రంలో పేర్కొన్న మారకదశనుండి కాపాడుకోవడానికి మృత్యుంజయజపం చేయాలని నాడీగ్రంథాలు సూచించాయి. శివరాత్రిరోజు బిల్వదళాలతో శివుణ్ణి పూజించాలి. లక్ష్మీనివాసస్థానాల్లో బిల్వం ప్రశస్తమైంది.

ఆదిత్యవర్ణే తపసోఽ ధిజాతో వనస్పతి
స్తవ వృక్షోఽ థ బిల్వః - (శ్రీసూక్తం 6వ మంత్రం)

"సూర్యకాంతివంటి కాంతితో ప్రకాశించే శ్రీదేవీ! నీ తపస్సువల్ల జనించిన బిల్వం (మారేడు) అనే వనస్పతియొక్క ఫలాలు - మా తపస్సువల్ల మాలోని బాహ్యాంతరాలైన అవలక్షణా లను పోగొట్టుగాక" అని పేర్కొనింది.



మనం ఆచరించే పూజాపర్వదినాల్లో
రాత్రివేళ చేసే పూజలు రెండే!
ఒకటి శ్రీకృష్ణజయంతి! రెండోది మహాశివరాత్రి!
రెండూ సగంరాత్రిలో ఏర్పడినవే!
జన్మాష్టమినుండి లెక్కిస్తే సరిగ్గా నూటఎనభైరోజులకు
శివరాత్రి వస్తుందని ధర్మశాస్త్రాలు పేర్కొన్నాయి.

మాఘమంటే, "మా+అఘ" అనగా పాపాన్నీ, మాయను, తత్ఫలమైన దుర్మరణాన్నీ తొలగించేది.

మనరాష్ట్రం త్రిలింగదేశంగా ప్రసిద్ధి చెందడానికి కారణం శ్రీశైలం, కాళేశ్వరం, దాక్షారామం, అనే మూడుక్షేత్రాలలోని శివలింగాలమధ్య ఉండడమే! ఇలా శైవక్షేత్రాలతో దేశభాషానామాలు ఏర్పరచుకొన్నగౌరవం మన ఆంధ్రులకే దక్కింది.

పరమేశ్వరుని
అరవైనాలుగురూపాల్లో లింగోద్భవమూర్తి
విశిష్టంగా పేర్కొనబడింది.
ఈ మూర్తికి పైన ఒక హంస,
క్రింద ఒకవరాహం ఉంటుంది.
ఈ శివలింగం బ్రహ్మాండానికి సంకేతం.
ఈ అరవైనాలుగుశివరూపాలకు
సంకేతంగానే అరవైమూడుమంది
నాయన్మార్లు మహాశివభక్తులు ఏర్పడ్డారు.

ఒకప్పుడు పార్వతీదేవి వినోదంకోసం పరమేశ్వరుని కళ్లను తనచేతులతో మూసివేసిందనీ, సూర్యచంద్రులే శివుని కుడి ఎడమ కన్నులు గనుక - అవి మూయబడినందున లోకానికి చీకటి ఏర్పడి, రాత్రి అయిందనీ, దీన్నే "శివరాత్రి" అంటారని శివరహస్య ఖండం పేర్కొనింది.

ఈనాటిరాత్రి గిరిజాకల్యాణోత్సవం చేస్తారు. జగన్మాతా పితల కల్యాణం జరిగినరాత్రే-లోకానికి శుభాన్నీ, సుఖాన్నీ ప్రసాదించే రాత్రి! మహాభారతంలోని శాంతిపర్వంలో చిత్రభానుడనే రాజు శివరాత్రివ్రతం జరిపి తరించాడని భీష్ముడు తెల్పాడు. శివభక్తులు ధరించే విభూతిని సిద్ధపరచుకోవడానికి ఈ రోజు పవిత్రంగా భావించబడింది. స్వామి దయానందుడికి శివరాత్రినాడే జ్ఞానోదయమైందట!

మనఃకారకుడైన చంద్రుడు బహుళచతుర్దశినాడు క్షీణ చంద్రుడు అవుతాడు కనుక ఆ రోజు ఎట్లో ఉపవాసపూజా జాగరణాదుల్తో మనశ్శక్తిని పెంచుకోవాలి. ఇందుకే ప్రతి బహుళచతుర్దశిని 'మాసశివరాత్రి' అన్నారు.

ఇలా మానవులు భౌతికంగా, ఆధ్యాత్మికంగా మహాశక్తి సామర్థ్యాలు సంపాదించుకొని, దీర్ఘాయుష్కులై, సుఖశాంతులతో, ఆనందంగా జీవనయాత్ర సాగించి, శివాన్ని (శుభాన్ని) పొంది, శివాన్ని దర్శించి, లోకానికి శివాన్ని చేకూర్చడమే శివరాత్రిఆంతర్యం!

ఓం నమ శ్శంభవే చ మయో భ వే చ
నమ శ్శంకరాయ చ మయస్కరాయ చ
నమ శ్శివాయ చ శివతరాయ చ ॥

॥ శివ మస్తు నిత్యమ్ ॥





ధారావాహిక ప్రారంభం....

# తిరుమల విశిష్టత

– బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావుశర్మ

**కలౌ వేంకటనాయకః**

**శ్రీ వేంకటాచలపతి కలియుగంలో
సమస్తప్రపంచాన్నీ నిర్వహించేదక్షతను,
బాధ్యతను స్వీకరించినస్వరూపం.
శ్రీ వేంకటేశ్వరవైభవం
సామాన్యమైనవిషయం కాదు.
ఆయన పేరే వేంకటేశ్వరుడు.**

**మిగిలిన అవతారాలకూ వేంకటేశ్వర
అవతారానికీ ఒక ప్రధానమైనభేదం ఉంది.
మిగిలిన అవతారాలలో ఆయనకు
రకరకాలైనపేర్లు వచ్చాయి.
మత్స్య, కూర్మ, వామన, నృసింహ, కృష్ణ,
రామావతారాలు ఎన్ని వచ్చినా,
ఆయా అవతారాలలో స్వామి తన
గుణాలను ఆవిష్కరించడంచేత
ఒక ప్రత్యేకమైన నామంతో పిలువబడ్డాడు.**

**కలియుగంలో పిలువబడే పేరు
వేంకటేశ్వరుడు. ఆయన తీసుకునేదికూడా
తలవెంట్రుకలు. చాలా చిత్రమైనవిశేషం.
వేంకటేశ్వరుడు అనే పేరులోనే ఉంది-
రహస్యమంతా. కలియుగంలో ఎవరికీ
భగవంతునిచరణారవిందాలలో
మనసు నిలబడదు. కలిప్రభావంచేత
చిత్తంచంచలమై తిరుగుతుంటుంది.**

శంకరులు శివానందలహరిలో –

**సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నట త్యాశాశాఖా స్వటతి ఝటితి స్వైర మభితః
కపాలిన్! భిక్షో! మే హృదయకపి మత్యంతచపలం
దృఢం భక్త్యా బద్ధ్వా శివ! భవదధీనం కురు విభో?॥**

**(20వ, శ్లోకం)**

శ్రీకాళహస్తీశ్వరశతకంలో ధూర్జటి –

**తమకం బొప్పఁ బరాంగనాజనపరద్రవ్యంబులన్ ప్రుచ్చిలం
గ మహోద్యోగము సేయు నెమ్మనముదొంగం బట్టి, వైరాగ్య పా,
శములం జుట్టి బిగించి నీదు చరణస్తంభంబునం గట్టివై
చి ముదం బెప్పడుఁ గల్గజేయఁ గదవే శ్రీకాళహస్తీశ్వరా!**

**(74వ పద్యం)**

మనసును నిగ్రహించడం అంత తేలిక కాదు. మనసుచేత అనేకపాపాలు చేస్తుంటాము. ఈ పాపాలు చేసేవారిని ఉద్ధరించడంకోసమని పరమాత్మ శ్రీ వేంకటేశ్వరుడిగా వచ్చారు. 'వేం' అంటే పాపం, 'కట' అంటే తొలగించేవాడు. మన పాపం ప్రతిబంధకంగా వచ్చి, పరమేశ్వరుణ్ణి చేరకుండా అడ్డగిస్తుంది. సాక్షాత్తుగా పరబ్రహ్మకే పాపాన్ని తొలగించగల శక్తి ఉంది. పాపం తొలగించగల ఈశ్వరుడై అంటే నియామకుడై సర్వజగత్తును కాపాడే ధారకుడు, పోషకుడు, శాసించగలిగినవాడై సాక్షాత్తుగా వైకుంఠం నుండి శ్రీ మహావిష్ణువు కదలి వచ్చినక్షేత్రం వేంకటాచలక్షేత్రం. అన్నమాచార్యులవారు వేదాలే పర్వతాలుగా వెలసినది తిరుమల కొండ అంటారు. బ్రహ్మాండపురాణంలోనూ, వరాహపురాణంలోనూ వేంకటాచలప్రశస్తి అని ప్రత్యేకంగా వర్ణించారు. ఒక్కొక్క యుగంలో–ఒక్కొక్క అవతారంలో ఒక్కొక్క మూర్తిగా స్వామి జగద్రక్షణ చేస్తూ వచ్చారు.

**కృతే తు నారహింహోऽభూత్
త్రేతాయాం రఘునందనః
ద్వాపరే వాసుదేవ శ్చ
కలౌ వేంకటనాయకః**

ప్రధానమైనమూర్తులు–కృతయుగంలో నారసింహుడుగా జగత్తును రక్షించాడు.

త్రేతాయుగంలో శ్రీరామచంద్రమూర్తి అయి రక్షించాడు. ఆయన ఏ అవతారంలో ఉన్నా ప్రక్కన శ్రీకారం ఉంటుంది. సంప్రదాయంలో వివాహమైన తరువాత పేరు ప్రక్కన శ్రీకారం ఉంటుంది. సంప్రదాయంలో వివాహమైన తరువాత పేరు ప్రక్కన శ్రీకారం లేకుండా వ్రాసుకోకూడదు. రాముడుకూడా శ్రీరాముడని పిలువబడ్డాడు. బాలకాండలో విశ్వామిత్రుడు ఇక్కడనుండి రాముణ్ణి లోకరక్షణకొరకు అప్పచెపుతున్నామని అంటాడు. ఎందువలన అనగా శక్తి ప్రక్కన చేరిన తరువాత శ్రీరాముడు పూర్ణత్వం పొందాడు. ఆయన లోక రక్షణార్థమని పదహారుగుణాలు కలిగిన సంపూర్ణమైన నరుడు ఎలా ప్రవర్తిస్తాడో అలా ప్రవర్తించాడు.

**కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ క శ్చ వీర్యవాన్ ।**
**ధర్మజ్ఞ శ్చ కృతజ్ఞ శ్చ సత్యవాక్యో దృఢవ్రతః ॥**

**చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః**
**విద్వాన్ కః క స్సమర్థ శ్చ కశ్చైక ప్రియదర్శనః ॥**

**ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కోఽ నసూయకః**
**కస్య బిభ్యతి దేవా శ్చ జాతరోషస్య సంయుగే ॥** (బాలకాండ 2-4)




శ్రీమద్రామాయణరచన ప్రారంభించే ముందే వాల్మీకి అడుగుతారు. ఆయన ప్రశ్నకు జవాబుగా పదహారుగుణాలూ పరిపూర్ణంగా ఉన్న అవతారం రామావతారమని నారదమహర్షి ప్రవచించారు. పదహారుగుణాలు కలిగిన రాముడు లోకాభిరాముడై, రావణాసురుణ్ణి నిగ్రహించాడు. రామావతారంలో చేసినంత రాక్షససంహారం ఏ ఇతర అవతారంలోనూ చెయ్యలేదు. కొన్నికోట్లమంది రాక్షసులను తెగటార్చాడు అని ఆయన బాలకాండలో చెప్పుకున్నారు. మిగిలిన అవతారాలకూ రామావతారానికీ తేడా ఒకటి ఉంటుంది. మిగిలిన అవతారాలలో స్వామి ఆవిర్భావం జరిగి, లోకాలను పీడిస్తున్న రాక్షసులను సంహరిస్తాడు. త్రేతాయుగంలో మానవులను కించపరచి మాట్లాడారు. రావణాసురుడు "మనుష్యులు నన్నేం చెయ్యగల"రని వరంలో మానవుల్ని కోరుకోవడం మానేశాడు. మనుష్యుల కీర్తిప్రతిష్ఠలు ఆవిష్కరించి, మానవత్వం గొప్పతనం చాటి చెప్పడానికి

**దశవర్ష సహస్రాణి దశవర్ష శతాని చ**
**రామో రాజ్య ముపాసిత్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి ॥**

బాలకాండలో పదకొండువేల సంవత్సరాలు ఈ భూమిని పరిపాలిస్తా నని చెప్పారు. ఆయన పరిపాలిస్తే తప్ప మళ్లీ మనుష్యులు ఎలా ప్రవర్తించాలో తెలియనిరీతిలో రావణాసురుడు భూమండలాన్ని పాడుచేసేశాడు. అటువంటి భూమిని ఉద్ధరించి సక్రమమార్గంలో పెట్టడానికి అన్ని సంవత్సరాలు రాముడు రాజ్యం చెయ్యవలసివచ్చింది. అంత గొప్పది రామావతారం!

ద్వాపరయుగంలో పరిపూర్ణావతారమైన కృష్ణపరమాత్మగా వచ్చాడు. ఆ అవతారంలో తాను చేసిన దుష్టశిక్షణ కొంత అర్జునునివెనుక తాను ఉండి, అర్జునుడు చేసినట్లుగా-కనపడేటట్లుగా ప్రవర్తింపచేసి, నిగ్రహింప చేసిన రాక్షసులను కొన్ని కోట్లమందిని, కురుక్షేత్రయుద్ధంలో ఎంతో మంది దానవులను, కండకావరంతో భగవంతుణ్ణి నిరసించినవారినీ సంహరించవలసి వచ్చింది. అటువంటి అవతారం - శ్రీకృష్ణావతారం.

కలియుగం వచ్చేసరికి ఆయన వేంకటనాయకుడుగా వచ్చారు. కలియుగంలో స్వామి దుష్టసంహారం చెయ్యలేదు. కత్తి నందకాన్ని పట్టి చంపలేదు. ఆయనఅవతారానికి చిత్రమైనస్థితి ఉంది. ఆయనదగ్గర ఉండే అన్నిరకాల ఆయుధాలు, ఆయన ధరించే విశేషమైన ఆభరణాలు ఒక్కొక్క అంశను పొందాయి. నందకం

అన్నమాచార్యుడుగా వచ్చింది. ఆయన దగ్గరుండే గంట వేదాంత దేశికులుగా వచ్చింది. ఒక్కొక్కటి అంశను పొంది, భక్తిని ప్రచారం చేశాయి. వేంకటేశ్వరస్వామి చాలాకాలం నోరు విప్పి మాట్లాడే వారు. తరువాతి కాలంలో తొండమాన్ చక్రవర్తిమీదకోపం వచ్చి, మాట్లాడనని భీష్మించారు. ఆ నాటినుండి మాట్లాడలేదు. ఇప్పటికీ ఆయన ఎవరికన్నా ఉపకారం చేసి రక్షించాలనిపిస్తే వేరొకరికి ప్రేరణ చేసి చేయిస్తుంటారు. ఆ కారణానికి వేంకటాచల క్షేత్రం పరమపావనమైన క్షేత్రం. అది సామాన్యమైనకొండ కాదు. ఆ కొండకూ, వేంకటేశ్వరునికీ గొప్పసంబంధం ఉంది. అది క్రీడాద్రి. శ్రీమహావిష్ణువు విహరించే పర్వతసానువు. ఆ క్రీడాద్రి భూమండలంమీదకి పర్వతంగా వచ్చింది. ఎప్పుడు వచ్చింది? కలియుగంలోనే వచ్చిందా? అంతకు ముందే ఉందా? అంటే అది కలియుగంలో వచ్చింది కాదు. కృతయుగంలో దానికి వృషాచల మనీ, తరువాతి కాలంలో దానికి అంజనాచలమనే పేర్లు ఉండేవి.

కలియుగం వచ్చిన తరువాత దానికి వేంకటాచలమని పేరు వచ్చింది. యుగాలు మారుతున్నా కొండ అలాగే ఉండి పోయింది. "కృతే వృషాద్రిం వక్ష్యంతి, త్రేతాయాం అంజనా చలమ్।" అని ఒక్కో యుగంలో ఒక్కో పేరుతో ఆ కొండ అలాగే ఉండిపోయింది. పేరుమాత్రం మారిపోయింది. ఇప్పటికీ వేంకటా చలంలో ఉన్న శిలాతోరణమెంత ప్రాచీనమో ఎవరూ చెప్పలేరు. చరిత్రకారులు కొన్నికోట్ల సంవత్సరాల క్రింద ఏర్పడిందని నిర్ధా రించారు.

వేంకటేశ్వరుడు రావడానికి మూడుప్రధానకారణాలు చెపు తారు. నారదమహర్షి వెళ్లి, వైకుంఠంలో ఉన్న శ్రీమహావిష్ణువును అడిగారు– "స్వామీ! నీవు స్థితికారుడవు. ఆ కలియుగంలో అల్పా యుర్దాయం కలిగిన అనేక పాపకృత్యాలు చేసి, అవి ప్రతిబంధకాలు కాగా, పరమేశ్వరుణ్ణి దర్శించలేక బాధపడుతున్నవాళ్లను ఉద్ధరించ డానికి నీవు చేసే ఉపకారమేమిటి?" అని ప్రార్థన చేస్తే– ఆ నాడు శ్రీమహావిష్ణువు అభయమిచ్చారు.

"కలియుగంలో నేను వేంకటేశ్వరుడుగా అవతరిస్తాను. కలియుగంలో అశ్వమేధాదియాగాలు నిషిద్ధం. యజ్ఞయాగాదులు చెయ్యలేరు. భూరిసంభావనలివ్వాలి. రామాయణం బాలకాండలో చెపుతారు– యజ్ఞం చెయ్యడం ఎలా ఉంటుందో! ఒక్కసారి వేంకటా చలం వెళ్లి, స్వామిని దర్శనం చేసినా, స్వామికి మనఃస్ఫూర్తిగా నమస్కరించినా, తలనీలాలు సమర్పించినా, చిన్నఆర్జితసేవ చేసినా వారిపాపరాశి దగ్ధమవుతుంది.

రెండవకారణం ద్వాపరయుగంలో శ్రీకృష్ణపరమాత్మగా ఉన్న ప్పుడు ఈ ప్రపంచంలో యశోదాదేవి పొందిన అదృష్టాన్ని ఏ తల్లీ పొంది ఉండదు. యశోదాదేవి అత్యంతప్రేమతో పెంచి పెద్ద చేసింది. కౌసల్య శ్రీమహావిష్ణువును రామచంద్రమూర్తిగా కన్నది. ఆమెకూడా సామాన్యమైన కష్టం పొందలేదు. దశరథమహారాజు అశ్వమేధయాగం చేశాడు. ఆ యాగంవల్ల పాపం ధ్వంసమవుతుంది. కొడుకు పుట్టకుండా అడ్డుపడుతున్న పాపం పోవడంకొరకు ముందు అశ్వమేధయాగం చేశాడు.

## పాపాలు పోవడానికి.....

**మన పాపాలు మన కేశాలను ఆశ్రయించి ఉంటాయి. ఆ పాపాలను మన నుంచి తీసి వెయ్యడంకొరకు కలియుగంలో ప్రతిదానికీ డబ్బుతోనే ముడి కనక ఎవరూ ఏమీ ఇవ్వలసిన అవసరం లేకుండా, మన ప్రమేయం లేకుండా, ప్రత్యేకించి పెంచాలనే అవసరం లేకుండా, తనంత తాను పెరిగేవి, భగవంతుని కృపాకరుణచేత ఉండే తల నీలాలు అడిగాడు.**

**ఆ కేశాల మొదళ్ళను ఆశ్రయించి, పాపాలు ఉంటాయి. వేంకటాచలం వెళ్లి, స్వామివారికి భక్తులు తలనీలాలు సమ ర్పించుకున్నంతమాత్రం చేత శరీరానికి పట్టి ఉన్న పాపరాశి తొలగిపోతుంది.**

**అందుచేత**
**వేంకటాచలక్షేత్రానికి ఆ ప్రాశస్త్యం ఉంది.**

పుత్రకామేష్టిచేత ప్రీతి చెందిన దేవతలు పాయసపాత్రలో ప్రసాదమిస్తే – ఆ అనుగ్రహంచేత రామచంద్రమూర్తి పెద్దకుమారుడుగా జన్మించాడు. అంత కష్టపడితే వచ్చింది – రామావతారం. కౌసల్య రామచంద్రమూర్తితో చిన్నతనంలో ఆటలాడుకుని ఆనందాన్ని అనుభవించినట్లుగా రామాయణంలో చెప్పలేదు. రాముడు పుట్టాడు, పెరిగాడు అంతే!

కృష్ణపరమాత్మ బాల్యక్రీడలు సామాన్యమైనవి కావు. చదువుతుంటే మనసు పరవశించిపోతుంది. వ్యాసభగవానుడు సంస్కృతంలో ఒక ఎత్తున అనుభవిస్తే – ఆంధ్రీకరించిన పోతనగారు పరవశించిపోయారు. యశోద అడగకుండా రెండు మూడు సార్లు విశ్వరూపదర్శనం చేసింది. యశోద పొందిన ఆనందం పోతనగారిపద్యాలు చదువుతుంటే కలుగుతుంది.

మన్నేటికి భక్షించెదు?
మన్నియమము లేల నీవు మన్నింపవు? మీ
యన్నయు సఖులును జెప్పెద
రన్నా! మన్నేల? మఱి పదార్థము లేదే?

(దశమస్కంధం పూర్వభాగం - 336)



"మన్ను తినవద్దని చెపుతున్నా తింటున్నావు. బలరాముడు చెప్పాడు. ఎందుకు తిన్నా?"వని అమ్మ వేలు చూపించి అడిగితే, అమ్మచెయ్యి పట్టుకుని ఎంతో టక్కరితనంతో,

అమ్మా! మన్ను దినంగ నే శిశువనో? ఆకొంటినో? వెఱ్ఱి నో?
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్, నన్నీవు గొట్టంగ వీ
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కాదేనిన్ మదీయాస్య గం
ధ మ్మాఘ్రాణము సేసి, నా వచనముల్ దప్పైన దండింపవే!

(10- పూ.భా.338)

"వట్టిదమ్మా, నీతో కొట్టించడానికి వీళ్లు ఇలాంటి మాటలు చెపుతున్నారు. మట్టి తింటే నా నోరు మట్టివాసన వస్తుంది కదా! నా నోరు వాసన చూడు"– అంటే, యశోద నోరు తెరు అన్నది. నోరు తెరిస్తే,

ఆ లలితాంగి కనుంగొనె
బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ
గోళ శిఖి తరణి శశి ది
క్పాలాది కరండ మైన బ్రహ్మాండంబున్.

(10-పూ.భా.340)

"ఏమిటి? పిల్లవాడినోటిలో సమస్తబ్రహ్మాండాలు!" అని ఆశ్చర్యపోయింది. అటువంటి అవతారం కృష్ణావతారం. కష్టపడి పెంచి పెద్ద చేసినా కొడుకుకల్యాణం చూడలేదు. ఆమె కోరుకున్నది కల్యాణం చూడాలని. అమ్మమాట కాదనలేని బలహీనత. ఏ తల్లి అవసరమూలేని పరమేశ్వరుడుకూడా పొంగిపోతాడు.

ఆయన "నేను వేంకటేశ్వరస్వామిగా అవతరించినప్పుడు నువ్వే దగ్గర ఉండి పెండ్లి చేద్దువుగాని" అని వరమిస్తాడు.

ఆ మాట నిలబెట్టుకోవడంకొరకు వకుళ మాత చేతుల మీదుగా వివాహం చేసుకోవడానికి వేంకటేశ్వరావతారం వచ్చింది.

మూడవకారణం వేదవతిని పరిగ్రహించాలి. పూర్వం కుశధ్వజుడనే మహర్షి వేదోపాసనచేస్తూ – యజ్ఞయాగాది క్రతువులు చేస్తూ– ప్రక్కన దర్భలు పెట్టి, అంతర్ముఖుడై సమాధి స్థితిలో ఉండగా, ఆయనపూర్వపుణ్యఫలం, ఉపాసనాబలంచేత ఆ దర్భలమీద ఒక చంటిపిల్ల ఆడుకుంటూ కనపడింది. కన్నులు తెరచి చూచి, దర్భలమీద పుట్టింది కనక 'వేదవతి' అని నామముంచి, పెంచి పెద్ద చేశారు.

యుక్తవయస్సు వచ్చిన తరువాత "నీకు వివాహం చేస్తా" నమ్మా అంటే, ఆమె "తండ్రీ! నేనెప్పుడూ శ్రీమహావిష్ణువుకే భార్యను" అంది. "వేదమెప్పుడూ ఆయనకు చెందిందే! ఆయన "శ్రీమహావిష్ణువును భర్తగా పొందటమంటే మాటలు కాదు, ఆ నాడు పార్వతీ దేవి హిమాలయాలలో తపస్సు చేసి, శివుణ్ణి భర్తగా పొందినట్లు– నీవు హిమవత్ ప్రాంతం చేరి తపస్సు చేసి శ్రీమహావిష్ణువుని భర్తగా పొందు" మని చెప్పాడు. ఆమె తపస్సు చేసుకోవడానికి వెళ్లింది. ఆమె వెళ్లి తపస్సు చేసుకుంటుండగా రావణాసురుడు వచ్చాడు. వచ్చి, ఆమెను బలవంతంగా గ్రహించే

ప్రయత్నం చేస్తుండగా "పరస్త్రీని బలవంతంగా చెరపట్టడం అనే నీ ప్రయత్నంచేతనే నీ వంశం నాశనమైపోవుగాక" అని శపించి, దావాగ్నిలో ఆమె శరీరం విడిచిపెట్టే ప్రయత్నం చేసింది.

ఆ సమయంలో అగ్నిహోత్రుడు ఆమె సాక్షాత్తు వేదవతి కనక, ఆమెను తీసుకుని వెళ్లి, తనభార్య అయిన స్వాహాదేవికి ఇచ్చి, కాపాడమని చెప్పాడు. కొంతకాలానికి రావణాసురుడు వచ్చి, సీతమ్మతల్లిని అపహరించి తీసుకునిపోతున్నాడు.

ఎదురుగా అగ్నిహోత్రుడు వచ్చాడు. వచ్చినవాడు సద్బ్రాహ్మణుడైన అగ్నిహోత్రుడని నమస్కరించకుండా వెళ్ళిపోతుంటే, వాడికి తగిన పరాభవం చెయ్యాలనుకున్నాడు– అగ్ని. "ఎంతపని చేసావు? దుందుడుకు తనంతో నన్ను మాటమాత్రం పలకరించ లేదు. ఔనులే! నీ రథంమీద ఉంది నిజమైన సీత అనుకుంటున్నావు. ఈవిడ మాయాసీత. రామునికి దూరశ్రవణవిద్య ఉంది. నీవు మారీ చుడితో కలసి సీతమ్మను అపహరించాలనుకున్నది విని "అసలు సీతను తెచ్చి" నా దగ్గర పెట్టి, మాయాసీతను పర్ణశాలలో పెట్టాడు. నీవు మాయా సీతను పట్టుకుని వెళుతున్నావు"–అన్నాడు. "కోపంలో చెప్పినా చాలా గొప్పమాట చెప్పావు. అసలు సీతను తీసుకుని రమ్మ"ని అన్నాడు. అగ్నిహోత్రునివద్ద ఉన్న వేదవతిని తాను తీసు కుని వెళ్లి, అసలు సీతను అగ్నివద్ద వదలి వేశాడు. రావణాసురుని అశోకవనంలో 12 నెలలపాటు సీతమ్మతల్లి బదులుగా వేదవతి బందీకృత అయి ఉంది.

### వైకుంఠపాళి 03 – సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 తి | | 2 వ | ర | 3 వి | క్ర | 4 యం | | 5 ప |
| మ్మ | | నం | | రి | | హ | | ద్మ |
| 6 ర | జ | | 7 మ | తా | బు | | 8 సే | ద |
| సు | | 9 లం | | వి | | 10 ధా | | ళం |
| | 11 కిం | కి | ణి | | 12 వా | కి | లి | |
| 13 వా | | ణి | | 14 ఏ | | ని | | 15 న |
| 16 యు | వ | | 17 ఆ | క | లి | | 18 బా | వ |
| లీ | | 19 చి | | వీ | | 20 కా | | నీ |
| నం | | 21 కాం | స్య | ర | వ | ళి | | తం |



రామచంద్రమూర్తి రావణాసురుణ్ణి సంహరించిన తరువాత అసలు సీతను తాను స్వీకరించడంకోసం మాయాసీతను అగ్ని ప్రవేశం చేయించాడు. వేదవతి అగ్నిహోత్రునివద్దకు వెళ్లిపోయింది. అందుకని అగ్నిపరీక్ష అనే నెపం జరిగింది. ఆనాడు అగ్నిహోత్రుడు ప్రార్థన చేసాడు. "నీ భార్యగా 12 నెలలు ఉంది కనుక పరిగ్రహించ" మని అన్నాడు. ఇద్దరూ ఉండటమనేది ఉండదు. రావణుడు వేదం చదివి ఘన, జట చెప్పుకునేవాడు. దానినే శ్రద్ధ అంటారు. తాను ఏం చెపుతున్నాడో దానిమీద విశ్వాసం ఉండాలి. రావణుడు వేదం చదువుకున్నాడు కానీ, వేదస్వరూపిణి అయిన సీతమ్మతల్లిని అప హరించి తెచ్చాడు. తాను ఏ కులదేవతారాధన చేస్తున్నాడో ఆ కుల దేవతను అపహరించి తెచ్చానని అనుకోలేదు. అందుచేత రావణుడు శ్రద్ధలేకనే నశించిపోయాడు.

అగ్నిహోత్రునికోరికకు రాముడు "ఇది రామావతారం. ఏకపత్నీవ్రతం అందుకని స్వీకరించను. కానీ కలియుగంలో వేంకటేశ్వరుడుగా వచ్చినపుడు వేదవతి మళ్లీ అయోనిజ అయిన పద్మావతిగా ఆవిర్భవిస్తుంది. ఆనాడు పద్మావతిగా స్వీకరిస్తా"నని మాట ఇచ్చాడు. ఈ మూడుమాటలు నిలబడాలి. అందుకని వేంకటేశ్వరావతారం వచ్చింది.

*(ఇంకా ఉంది)*

## శివాలయంలో నందికొమ్ముల మధ్యనుంచి ఈశ్వరుణ్ణి దర్శించాలంటారు, ఎందువల్ల?

– రమణ, నెల్లూరు.





రాశిచక్రంలోని మిథునరాశి గౌరీశంకరస్వరూపం. వృషభరాశి నందీశ్వరునికి ప్రతీక. రాశిచక్రం ఉదయించే సమయంలో వృషభరాశి, మిథునరాశికి కిందుగాను; అస్తమించే సమయంలో మిథునరాశి, వృషభరాశికి కిందుగాను ఉంటుంది. ఆ కారణంవల్లనే శివుడు వృషభవాహనుడూ, వృషభధ్వజుడూ అయ్యాడు. నందికొమ్ములమీదినుంచి శివదర్శనం చేయడంలోని అంతరార్థమదే! మిథునరాశిలోని ఆర్ద్రానక్షత్రం రుద్రునికి సంకేతం.

శివుడు లయకారుడు. అగ్నినే మూడవనేత్రంగా కలవాడు. అటువంటిముక్కంటికంటి కెదురుగా వెళ్లడం, తీక్షణమైన శివతేజస్సుకు ఎదురుగా వెళ్లడం మంచిది కాదని, అందునా శివునికి, నందికి మధ్యగా వెళ్లడం పనికిరాదని నిషేధించారు. శివునికి అత్యంతప్రీతిపాత్రుడైన నందీశ్వరుణ్ణి దర్శించి, ఆయనఅనుమతితో శివునిఅనుగ్రహాన్ని పొందవలసిందని ఆదేశించారు.

**వృషస్య వృషణం స్పృష్ట్వా శంకర స్యావలోకనమ్ । శృంగమధ్యే శివం దృష్ట్వా కైలాసం భవతి ధ్రువమ్ ॥**

**భావం :** వృషభం (నందీశ్వరుని) యొక్క పృష్ఠభాగాన్ని స్పృశిస్తూ శంకరుణ్ణి దర్శించడం విధివిహితం. నందీశ్వరునికొమ్ముల మధ్యనుంచి శివుణ్ణి చూచినవాళ్లకు నిశ్చయంగా కైలాసప్రాప్తి కలుగుతుంది – అని చెప్పబడింది. అందువల్లనే,

**నందీశ్వర! నమ స్తుభ్యం సాంబానందప్రదాయక! । మహాదేవస్యసేవార్థం అనుజ్ఞాం దాతు మర్హసి ॥**

"సాంబశివునికి ఆనందప్రదుడవైన ఓ నందీశ్వరా! నీకు నమస్కారం. మహాదేవుణ్ణి సేవించడానికై నాకు అనుజ్ఞ ప్రసాదించు"– అని నందీశ్వరుణ్ణి ప్రార్థించి – తర్వాతనే పార్వతీ పరమేశ్వరులను సేవించాలి.




## వివిధదేవతలకు ప్రదక్షిణం ఎన్నిమార్లు చేయాలి?

– జి.కాత్యాయని, కాకినాడ.

పాంచరాత్రఆగమంలోని పుష్కరసంహితలో ప్రదక్షిణ విధిని గూర్చి ఈ క్రిందివిధంగా చెప్పబడింది:

**ఏకం గణాధిపే కుర్యాత్, ద్వే సూర్యే, త్రీణి శంకరే।**
**చత్వారి కేశవే దేవే సప్తాశ్వత్థే ప్రదక్షిణమ్॥**

గణాధిపతికి ఒకమారు, సూర్యునికి రెండుమార్లు, శివునికి మూడుమార్లు, విష్ణువుకు నాలుగుమార్లు, అశ్వత్థవృక్షానికి ఏడుమార్లు ప్రదక్షిణం చేయవలసిందని భావం.

ఇదిగాక– శివప్రదక్షిణ విశేషవిధానం వేరుగా చెప్పబడి ఉంది. అది – శివాలయంలో వాయవ్యదిగ్భాగం చండీశ్వరస్థానం. అక్కడ చండీశ్వరుణ్ణి ప్రతిష్ఠించినా, లేకున్నా – అది చండీశ్వర నివాసంగానే భావించాలి. ఇక శివాభిషేకం చేసిన జలం ప్రవహించి, బయటకు వచ్చే జలమార్గాన్ని సోమసూత్ర మంటారు. శివాలయం ఏ దిక్కుకు అభిముఖంగా ఉన్నప్పటికీ– సోమసూత్రం ఉత్తరదిశలోనే ఉంటుంది; చండీశ్వరుడు వాయువ్య మందే ఉంటాడు శివలింగానికి ఎదురుగా నంది, అతనివెనుక ధ్వజస్తంభం ఉంటాయి.

ఇతరదేవాలయాలలోవలె శివాలయంచుట్టూ ఒక సాధారణప్రదక్షిణం చేసినట్లయితే – ఒక్కప్రదక్షిణఫలంమాత్రమే లభిస్తుంది. కానీ ప్రత్యేకంగా శివాలయాలలో విశేషవిధిప్రకారం చేసేప్రదక్షిణం ఒక్కటి చేసినంతనే అనేకప్రదక్షిణల ఫలితం లభిస్తుందని శివ పురాణంలో చెప్పబడి ఉంది. ఆ విశేషవిధి విధానం ఇది :

వృషం చండం వృషం చైవ సోమసూత్రం పునర్వృషమ్ । చండం చ సోమసూత్రం చ పునశ్చండం పునర్వృషమ్ ॥

వృషభం – అనగా నందీశ్వరునివద్దనుండి ప్రదక్షిణంగా చండీశ్వరునివద్దకు వచ్చి – అక్కడి నుండి అప్రదక్షిణంగా తిరిగి, నందీశ్వరునివద్దకు వెళ్లి, – అక్కడినుండి సోమసూత్రంమీదుగా వృషభాన్ని చుట్టి, ప్రదక్షిణంగా చండీశ్వరునివద్దకు వెళ్లి, సోమసూత్రాన్నికూడా దర్శించి –మళ్లీ అప్రదక్షిణంగా వెనుకకు చండీశ్వరుని మీదుగా వృషభం వద్దకు తిరిగి రావాలి– ఇది ఒక విశేషప్రదక్షిణం, ఇది విధివిహితం. అనేకసామాన్యప్రదక్షిణాలఫలాన్ని ఒక్క విశేషప్రదక్షిణం ఈయగలదు.

గృహస్థులు సవ్యాపసవ్యమైన ఈ ప్రదక్షిణాన్ని చేయడంవల్ల విశేషఫలాన్ని పొందగలరు. బ్రహ్మచారులు సవ్యప్రదక్షిణాన్నీ, సన్న్యాసులు అపసవ్యప్రదక్షిణాన్నీ చేయాలని చెప్పబడింది.

'సోమసూత్రం న లంఘయేత్' – అనే సూత్రంప్రకారం శివప్రదక్షిణంతో సోమసూత్రాన్ని దాటరాదు.

**లంకేశ్వరునికి పదితలలుండడంలోని అంతర్యమేమిటి?** – కె.గోపి, రాజమండ్రి

విశ్రవసు బ్రహ్మపుత్రుడు, లంకేశ్వరుడూ ఐన రావణుడు పదితలలు, ఇరవైచేతులతో జన్మించినట్లుగా వాల్మీకిరామాయణంలో స్పష్టంగా చెప్పబడింది. దీని ఆంతర్యం –

శిరస్సు ఆలోచనాస్థానం. ముఖం – విద్యకు, వాక్కుకు నెలవు. సర్వజ్ఞానేంద్రియాలూకూడా ముఖంలోనే ఉంటాయి.

ఇక చేతులు కర్మణ్యత్వానికి, క్రియాశీలతకూ ప్రతీకలు.

సారాంశంగా – శిరస్సులు (లేదా ముఖాలు), – అధికసంఖ్యలో ఉండడమనేది–అతనిలో పొంగిపొరలుతున్న సర్వ విద్యాసమగ్రతకూ, బుద్ధికుశలతకూ, మేధాశక్తికి, పాండితీవైభవానికి (Qualities to Head) చిహ్నం.

పలుచేతులు కలిగి ఉండడం – క్రియాకౌశలానికీ, క్రియాశీలతకూ చిహ్నం.

మరొక అంశం.

ప్రజాపతిబ్రహ్మయొక్కముఖంనుండి బ్రాహ్మణులు, భుజాలనుండి క్షత్రియులు – జన్మించారని చెప్పబడింది. తన భుజశక్తితో ప్రజారక్షణం చేయడం క్షత్రియుని కర్తవ్యమని చెప్పబడింది. బుద్ధిశక్తియే బ్రాహ్మణశక్తి, భుజశక్తియే క్షత్రియశక్తి.

రావణుడు బ్రాహ్మణుడై జన్మించి – క్షత్రియధర్మాన్ని స్వీకరించినవాడు. బ్రాహ్మణలక్షణమైన బుద్ధిశక్తి, క్షత్రియలక్షణమైన భుజశక్తి రావణునియందు అపారంగా ఉన్నాయని చెప్పడానికి సంకేతమే రావణునిపదితలలూ; ఇరవైచేతులూనూ.

తన భుజక్తితో ప్రజాపాలనం చేసే క్షత్రియునికి – బుద్ధిశక్తితో మార్గనిర్దేశనం చేసేవాడు బ్రాహ్మణుడు. ఈ బ్రహ్మ–క్షత్రియశక్తులు అత్యధికంగా రావణునియందు మూర్తీభవించాయనేదే – రావణునిపదితలలూ ఇరవైచేతుల అంతరార్థం. ఆ కారణంగానే అతడు సర్వలోకవిజేత కాగలిగాడు. ఆ శక్తుల్ని సన్మార్గంలో ఉంచకపోగా – ఋషిల్ని వేధించడం, పతివ్రతల్ని బలాత్కరించడం, జీవితాన్ని రజస్తమోగుణాలకు నిలయం చేయడం, అహంకారంతో విర్రవీగడం అనేవి – అతని పతనానికి దారితీసాయి. ధర్మజ్ఞులు చెప్పిన మంచిమాటలు వినకపోవడం అతని నైజం! రజోగుణం యొక్క ఫలం దుఃఖం కనుక రావణునికి అదే ప్రాప్తించింది.



అదే కాంచీపురం.

ముక్తికాంతకు స్థిరనివాసమైన అయోధ్య ఉత్తరమధుర. మాయ, కాశీపురి, ఉజ్జయిని, ద్వారకలతో పాటు ముక్తికాంతానగరిగా ప్రసిద్ధి పొందినపట్టణం.

ఆ పట్టణం ఆనుకొని వేగవతి ప్రవహిస్తుంది. ఆ నది ఆ నగరానికి పెట్టనికోట. ఆ నగరం సామాన్యమైందికాదు. బ్రహ్మదేవునికి ఉత్తరవేది. ఆ ఉత్తరవేది నుండే మహావిష్ణువు వరదుడై ఉద్భవించాడు.

ఆనగరం మధ్య 'హస్తిగిరి' ఆ గిరిమీద పుణ్యకోటివిమానం. ఆ విమానం ఆలయంలో రమాదేవీసహితుడైన దేవరాయస్వామి, కోరినవారికి కోరిన వరాలిచ్చే దేవుడు కావడంవల్ల వరదరాజు. ఆ వరదరాజస్వామి ఆలయఅగ్రభాగాన 'హేమకమలాకరం'. ఆ కమలాకరంలో ఒక పద్మంలో 'పాంచజన్యాంశం' ప్రవేశించింది. సరోవరం కళకళలాడింది కాసారలక్ష్మికి 'చూలాలి' చిహ్నాలు కనబడ్డాయి. పాలకడలివాసుడైన మహావిష్ణువుకు బొడ్డు తామరలో బ్రహ్మ పుట్టినట్లు– హేమకమలాకరంలోని పద్మంలో శ్రవణానక్షత్రం, ఆశ్వయుజ మాసంలో శిశువు జన్మించాడు.

సూర్యుడు పుట్టగానే చీకట్లు మాయమైనట్లు బిడ్డ పుట్టగానే అజ్ఞానాంధకారం తొలగిపోయింది. దేవదుందుభులు మ్రోగాయి. అప్సరసలు నాట్యం చేశారు. దేవతలు పూల వానలు కురిపించారు. శుభసూచనలు హేరాళంగా కనిపించాయి. దేవకీదేవిగర్భంలో మహావిష్ణువు కృష్ణుడుగా జన్మించినవేళ ఏలాంటి పారవశ్యమో–ఆలాంటి ఆనందాను భూతే సర్వత్ర కనిపించింది.




వైకుంఠధాముడు సర్వం పరిశీలిం చాడు. కమలాక్షితో కాంచీపురానికి వచ్చాడు. పద్మాకారంలాంటి తొట్టెలో తుమ్మెదల గుంపు లనే సరపణులలో వేదనాదం చేసే వినూత్న శిశువును స్వామి చూశాడు. తానే ఎత్తి ప్రాణేశ్వరికి అందించాడు. కమలాలయ సంతోషించింది. అక్కున చేర్చుకొంది. పాలు కుడిపింది.

కమలాకమలాక్షులపోషణలో శిశువు కోటిమన్మథాకారుల లావణ్యాలతో మెరసిపోతూ లక్ష్మీనారాయణులకు నమ స్కరించాడు. మనసారా స్తుతించాడు. ఆ దంపతులు శిశువు సరోవరంలో జన్మించడం వల్ల 'సరోవరయోగి' గా నామకరణం చేశారు. అంతేకాదు 'కుమారా! సంసారమనే చీకటిలో పడి దారీతెన్నూ తెలియక, మగ్గుతున్న వారికి దారి చూపి రక్షించు. ఇదే మా సంప్రార్థన. మేము ఎపుడూ నీతో – నీలోనే ఉంటాము' అన్నారు.

సరోవరయోగి తల ఊపాడు. సంచారజీవులై అనేకదేశాలు తిరుగుతూ దైవకార్యనిర్వహణ తత్పరుడై తనమీద పెట్టిన బాధ్యతను నెరవేరుస్తున్నాడు.

సరోవరనామయోగికి సరి అయిన తమిళనామం పొయ్‌గై ఆళ్వార్. ఈ ఆళ్వారుకే కాసారయోగి, ఆదియోగి, దీప ముని, ప్రథమయోగి, శ్రవణముని, పద్మ ముని పాంచజన్యాంశయోగి అని నామాం తరాలు. వీరిని –

తులాయాం శ్రవణే జాతం.
కాంచ్యాం కాంచనవారిజాత్

– ఆచార్య కె.సర్వోత్తమరావు

ద్వాపరే పాంచజన్యాంశం
సరోయోగిన మాశ్రయే

అని సేవించడం సంప్రదాయం.

## అదే మల్లాపురం

ఈ పురానికి సాటి కాదగిన పురం ముల్లోకాలలోనూ లేదు.

అంతేకాదు. ఆ పురం సముద్ర తీరంలో ఉంది. ఆ సముద్రమూ సామాన్య మైంది కాదు. భయంకరమైన మొసళ్ళు, తిమింగిలాలు, కూర్మాలు యథేచ్ఛగా సంచ రించే సాగరం. ఆ పురంలో నీలోత్పలంలో కౌమోదకీ అంశంతో ఒక ముని జన్మించాడు. ఆ యోగి జన్మించిన తిరునక్షత్రం వసుతార (ధనిష్ఠ). మాసం ఆశ్వయుజం. కౌమోదకీ అంశంతో జన్మించిన బాలుణ్ణి చూడడానికి కమలా కమలాక్షులు వచ్చారు. ఆ బాలునికి సత్త్వగుణమనే పాలును, హరి భక్తి అనే స్నేహాన్ని మేళవించి, ఉగ్గు పోసి పోషించారు. సకలభూతతతిని సంస్కృతీ సముద్రంనుండి తరింపచేయ గలిగిన వాడుఈతడని 'భూత యోగి'గా నామకరణం చేశారు. ఆకుమారుణ్ణి చూచి "పుత్రా! జీవకోటిలో రాక్షసప్రవృత్తి మించిపోయింది. మానవులు అజ్ఞాను లవుతు న్నారు. మమ్మల్ని అసలు తలచుకోవడంలేదు. వారికి ఆత్మవిద్య నేర్పడం నీ విధి. మేము నీకు సహాయకులమై ఉంటా"మని భరోసా ఇచ్చారు.

ఈ భూదత్తాళ్వార్‌కు ద్వితీయ యోగి, మల్లాపురయోగి, ఉత్పలముని, గదాంశయోగి అని నామాంతరాలు. మల్లా పురానికి తమిళంలో తిరుక్కడల్‌మల్లై అని ప్రాచీననామం. వీరిని సంప్రదాయవాదులు "తులా శ్రవిష్ఠా సంభూతం భూతం కల్లోలమాలినః తీరే ఫుల్లోత్పలే మల్లాపుర్యా మీడే గదాంశజమ్" అని సేవిస్తారు.

## అదే మయూరపురం

మైలాపూర్‌గా పిలువబడే మదరాసుప్రాంతం. ఆ పురంలో ఆశ్వయుజమాసంలో శతభిషనక్షత్రంలో 'లతికాహ్రదమనే' కొలనులో ఎర్రకలువలో నందకాంశంతో ఒక శిశువు జన్మించాడు.

ఆ శిశూదయకాలంలో జగదేకమాత వనజాక్షులు విచ్చేసి, సంప్రీతితో ఎత్తి పోషించారు. ఆ శిశువు పెరుగుదలకు సంతోషించారు.

'కుమారా! పెద్దలకు పెద్దగా జీవిస్తావు. నీవు మహదాహ్వయనామంతో పిలువ బడతావు. మేము నీతోడివారమే అంటూ ఆయోగిహృద మనే నీలోత్పలంలో ప్రవేశించారు.

ఈ మహదాహ్వయయోగికి 'పేయాళ్వార్ మహాయోగి తృతీయయోగి, భక్తిసారముని, మయూరపురముని, శతభిషయోగికూపముని, కైరవకూపముని' అని నామాంతరాలు. ఈ మునినే **తులాశతభిషగ్జాతం మయూరపురి కైరవాత్ మహాంతం మహదాఖ్యాతం వందే శ్రీనందకాంశజమ్** అని సంప్రదాయవాదులు సంస్తుతి చేస్తారు.

ఈ విధంగా ఆశ్వయుజమాసంలోనే వరుసగా శ్రవణం, ధనిష్ఠా, శతభిషా నక్షత్రాలలో జన్మించిన ముువ్వురు ద్రావిడదేశంలో మూడుపవిత్రపుణ్యప్రదేశాలలో జన్మించి, పరిపూర్ణ చిత్తులై 'బ్రహ్మవిన్యస్తకరులై' తమలాంటి ఉత్తములైన యోగితము లెవరైనా దేవతా మందిరాలలో, నదీతీరాలలో, దేశాలలో, నానాతీర్థాలలో ఉన్నారేమోనని వెదకుతూ, తిరుగు తుండేవారు. వారికి వీసమంత లౌకికఆసక్తి లేదు. ఈ పరిస్థితిని గుర్తించిన పంకజోదరుడు వీరికి తన 'పరత్వ' మేమిటో తెలియచెప్పాలనుకొన్నాడు. అంతే కాదు – వీరి ద్వారా లోకుల అజ్ఞానమోహం తొలగించాలని నిశ్చయించుకొని, వీరు ముువ్వురినీ ఒకచోట ఒకరికి తెలియకుండ ఒకరిని చేర్చాడు. అది తిరుక్కోవిలూర్ అనే పుణ్యక్షేత్రం. వామనక్షేత్రంగా ప్రసిద్ధి వహించిన క్షేత్రం. అది దేవనగరికూడా!

యోగివరులు ఒకరితో ఒకరు పరిచయమున్నవారు కారు. కాని వారు 'తిరుక్కో విలూర్' చేరుకొన్నారు.

అది సంధ్యాసమయం! సూర్యుడు పడమటికొండ చేరుకొంటున్నాడు అంతవరకు నిర్మలంగా ఉన్న ఆకాశంలో మబ్బులు కమ్ముకొన్నాయి. చిలికిచిలికి పెనువాన కురియ సాగింది. వజ్రాయుధం దెబ్బలాగా పిడుగులు ఉరుములతో గాలివాన వీచింది. వడగళ్ళు ఏక ధాటిగా పడుతున్నాయి.



చీకటి క్రమ్ముతుంటే ఎదుటివారెవరో గుర్తు పట్టకపోయే టంతటి అవస్థ దాపురించింది. క్రమంగా రాత్రి తొలిఅడుగు వేసింది– అపుడే ఆదియోగీంద్రుడు అక్కడకి వచ్చాడు.

ఒక ఇంటిముంగిట చిరుఅరుగు. ఒకరుమాత్రమే కూర్చో గలిగిన స్థలం. ఆ స్థలంలో ఆసీనులయ్యారు. ఈలోగా రెండవ యోగి వచ్చాడు.

మొదటి యోగీంద్రుడు "ఈ సంకటస్థితిలో చినుకులకు తడవడం ఇష్టం లేక వచ్చాను. మీరూ రండి. ఇద్దరమూ నిలిచి ఉందాం". అని ఆప్యాయంగా రెండవయోగిని ఆహ్వానించాడు. ఆలాగే ఆ ముని వచ్చి నిలబడ్డాడు. ఈ లోగా మరొక మహాయోగి అక్కడికి వచ్చాడు.

అరుగుమీదివారు "ఒకరు పరుండడానికే తావుంది. కానీ, ఎట్లో ఒదుగుతూ మేమిద్దరం ఉన్నాం. మీరూ వచ్చారు. వానలో తడవకండి. ఒకరి కొకరు సర్దుకొందా"మని ఆహ్వానించారు. ఆలాగే మహదాహ్వయులు వారితో చేరారు. ముప్పురిది విచిత్రమైన కలయిక. వర్షం ఆగలేదు.

స్వామి చూశాడు – వీరిని పరీక్షించాలనుకొన్నాడు. ఏ మాత్రమూ ప్రవేశించడానికి సర్దుకుపోవడానికి వీలులేని చోట లేదు. తాను నడుమ ప్రవేశించాడు.

అంతే కాదు లేనవ్వుతో గానుగలో చెఱకురసం కోసం చెఱుకుకర్రను జొనిపినట్లుగా వారి మధ్య నలుగుతూ ఒత్తిడి చేయసాగాడు.

యోగీంద్రుల కిది విషమస్థితి! ఉన్నవారేమో ముగ్గురు మరొకరికి తావు లేదు. అయినా ఏమిటీ ఒరపిడి? నాల్గవవాడెవడో? అతని అంతుతేల్చాలని ఆదియోగి నిశ్చయించి,

వైయం తకళియా వార్వమే నెయ్యాక
సెయ్యాకతిరోన్ విళక్కాక శెయ్య
శుదరాళియా నడిక్క శూట్టినేన్ శొన్మాలై
ఇడలాళి నీంగుకవే యెన్ఱు

అని నీరాజనం అర్పించారు. ('భూమిని ప్రమిదగా చేసి, సముద్రజలాన్ని నేయిగా అందుంచి, ఉష్ణకిరణుడైన సూర్యుణ్ణే వత్తిగా చేసిన దీపంతో స్వామికి అర్పిస్తాను').

అపుడు రెండవయోగి కనిపించని పరమాత్ముణ్ణి ఉద్దేశించి,

అన్బే తకళియా ఆర్వమే నెయ్యాక
ఇన్బురుకు శింద్దై యిడు తిరియా నమ్బురికి
ఇనచ్చుదర్ విళక్కేత్తినేన్ నారణఱ్కు
ఇణనత్తమిళ్ పురిందనాన్

– అని పాశురం పాడారు.

ఈ భావాన్నే చిన్నన్న

ప్రేమ-పంక్తియ మితిలేని భక్తియే చమురు
నానందభరిత హృదబ్జంబె వత్తి
గా నొనరించి వికాసమై యాత్మఁ
దిరమొందు జ్ఞానంబు దీపంబుఁజేసి
పెరిమె నారాయణార్పితము గావించె

– అని వర్ణించాడు. జ్ఞానదీపప్రకాశంతో అంధకారం అణగింది. అప్పుడు మూడవయోగి తనముందు సాక్షాత్కరించిన స్వామిని చూచి,

సిరి గంటి చెన్నుమించినమేనుఁ గంటిఁ
గరమొప్పు వదనవికాసంబుఁ గంటి
సల్లలితావనీస్తనకుంభశుంభ
పల్లవంబులఁబోలు పాదము ల్గంటి
సరసిజ హల శంఖ చక్రాంకుశాంక
చరణముల్ జగదేకశరణముల్ కంటిఁ
దరణిబింబము చాయఁ దరళించు కనక
సురుచిరాంశుకము నంశుకముఁ గన్గొంటి
శ్రీమించు కటితట శ్రీసతీవరణ
దామముల్ మేఖలాదామము ల్గంటి
వాత్సల్య జలధి కైవడి నొప్పుచున్న
వత్సంబు కంటి శ్రీ వత్సంబు కంటిఁ
జుట్టుఁ గైదువు వలచుట్టుశంఖంబు
పట్టి చూపట్టిన బాహువు ల్గంటి
శీతాంశుమండలశతకోటికోటి
రీతిఁ జూపట్టు కిరీటంబుఁ గంటి
మలఁగులై తెల్లఁదామరలఁదామరల
గలహించు నిడువాలుఁగన్నులుఁ గంటి
మకరకుండల బాలమార్తాండరుచుల
వికసించు వదనారవిందంబుఁగంటి

అని స్తోత్రంచేశారు. మిగిలిన ఇద్దరు మునియోగులు ప్రత్యక్షమైన విష్ణువుని చూచి పులకించారు. స్వామి విశ్వరూపి కనుక విశ్వరూపం తనంతట వారిఎదుట ప్రదర్శించాడు. ఆ సర్వమయుని రూపాన్ని మనసా అవలోకించుకొన్నమునియోగులు పదేపదే స్మరించుకొంటూ ఆనందపరవశులై 'పాశురాలు' పాడారు.

**రాగయుక్తమైన పద్యాలే పాశురాలు.**
**మునియోగుల మహత్తర రచనలను అంతాదు లనడం సాహిత్య సంప్రదాయం.**

**పాశురాలు ప్రబంధచింతామణులు.**
**ముక్తి సాధానికి సోపానాలు. వేదసారాలు.**

మునియోగులను ఒకచోట చేర్చిన ఆ స్వామివారి అంతాది రచనలకు ఆనందపరవశుడైనా, వారు భూలోకంలో చేపట్టవలసిన కార్యభారం మాత్రం మరచిపోలేదు.

భక్తిరసంలోమునిగి, జీవకోటిసముద్ధరణకార్యంనుండి నివృత్తులౌతారేమో అని వారికి వెనుకటి ప్రాకృతమానసికస్థితిని గుర్తుకుతెచ్చేలా చేశారు.

తిరుక్కోవలూర్ అనుభవంతో మునియోగులు భూలోక సంచారం చేయసాగారు. *(సశేషం)*




త్రికరణశుద్ధిగా శ్రీవేంకటేశ్వరుణ్ణి పూజించి తరించిన భక్తశిఖామణి అన్నమయ్య. ఆయనకు సర్వం శ్రీ వేంకటేశ్వరమయమే! ఆయన రచించిన సంకీర్తన రాశిలో దశావతారస్తుతులున్న సంకీర్తనలెన్నో ఉన్నాయి.

వీటిలో శ్రీరామ, శ్రీకృష్ణ, నృసింహావతారాలను ప్రత్యేకంగా వేరు వేరు కీర్తనలలో వర్ణించినవి కనిపిస్తాయి. అలాంటి కీర్తనలలో ఆయా అవతారాల సమగ్రకథలు వర్ణింపబడినాయి. పది అవతారాలను ఒకే కీర్తనలో వర్ణించిన వాటిని అన్నమయ్యదశావతార సంకీర్తనలుగా గ్రహించాలి. ఇలాంటి సంకీర్తనలు 53 ఉన్నాయి. వీటిలో కొన్ని సంస్కృత సంకీర్తనలు కూడా ఉన్నాయి. భగవంతుని నామగుణ కర్మలను కీర్తించడమే అన్నమయ్యసంకీర్తనల లక్ష్యం. ఆ లక్ష్యం దశావతారకీర్తనలలో సంపూర్ణంగా నెరవేరింది.

**అన్నమయ్య ఒకే సంకీర్తనలో పది అవతారాలను వర్ణించిన సంకీర్తనలు యాభైమూడు ఉన్నాయి.**



# అన్నమయ్య - అవతారాలు

– ఆచార్య గల్లా చలపతి



ఒక్కొక్క అవతారాన్ని పేర్కొని, ఆ అవతారగుణాలను, ఆ అవతారంలో భగవంతుడు నిర్వహించిన లోకోత్తరమైన పనులను ప్రస్తుతించి, ఆ పనులమూలంగా లోకస్థితి ఎలా చక్కబడిందో తెలపడం ఆయనపద్ధతిగా కనిపిస్తుంది. ఇవి వివిధ ప్రయోజనాలను ఉద్దేశించి, రచింపబడినాయి. ఏ లౌకికం లేక అలౌకికప్రయోజనం ఉద్దేశింపబడుతుందో ఆ ప్రయోజనం పల్లవిలో కనిపిస్తుంది. చరణాలలో దశావతారవర్ణన సాగుతుంది. సంకీర్తన చివర పదముద్రలో అవతారాలన్నీ వేంకటేశ్వరునివే నని సమన్వయింపబడుతుంది. లేదా ఆయా అవతారాల ప్రయోజనం శ్రీనివాసుణ్ణి సేవిస్తే కలుగుతుందని చెప్పడం కనిపిస్తుంది. మొత్తంమీద దశావతారతత్త్వం వేంకటేశ్వరతత్త్వంగా నిర్ణయమవుతుంది. అన్నమయ్య దశావతారకీర్తనల ఆంతర్యం ఇదే!

సంకీర్తన నిర్మాణంకూడా దశావతారస్తుతులకు సరిగ్గా అతికినట్లు సరిపోయింది. అన్నమయ్య సంకీర్తన రెండుపాదాల పల్లవితో ప్రారంభమవుతుంది.

తరువాత నాలుగుపాదాలు గల మూడుచరణాలుంటాయి. ఇలా మొత్తం సంకీర్తనలో పధ్నాలుగు పాదాలుంటాయి. మూడున్నరచరణాలలో అంటే పదిపాదాలలో దశావతారాలు కనిపిస్తాయి. చివరి అర్ధచరణంలో అంటే రెండుపాదాలలో వేంకటవిభుని పదముద్ర, స్వామిసర్వేశ్వరత్వం కనిపిస్తాయి. ఆయన్ను సేవిస్తే పొందగలిగే ప్రయోజనం వివరింపబడుతుంది.

శ్రీనివాసుడు వినా అన్నమయ్యకు లోకం లేదు. తన జీవితాన్ని స్వామికి ముడుపు కట్టాడు. ఆయన ఏమి చెప్పినా, ఎలా చెప్పినా అన్నీ శ్రీనివాసునితోనే! నవవిధభక్తిమార్గాల ద్వారా స్వామిని అర్చించాడు. మానవులు ఏ రకమైన భక్తితో అర్చించినా స్వామి ప్రసన్నుడవుతాడని చాటాడు.



**పది అవతారాలు ధరించి, ఎన్నో కార్యాలు సాధించిన శ్రీహరికి భక్తులను రక్షించడం ఒక లెక్క కాదు. మానవులకు సహజగుణమైన భయాన్ని పోగొట్టి, అభయ ప్రదానం చేసేవాడు వేంకటేశ్వరుడేనని, సర్వాంతర్యామి అయిన ఆ పరమాత్మ మనకెప్పుడూ దగ్గరగానే ఉంటాడు.**

**'ఎంతమాత్రమున నెవ్వరు తలచిన యంతమాత్రమే నీవు'** – అని శ్రీనివాసుణ్ణి స్తుతించిన అన్నమయ్య అనేక సంకీర్తనల్లో స్వామిసర్వాంతర్యామిత్వాన్ని కొనియాడాడు. ఆ సంకీర్తనలు పరిశీలిస్తూ వెళితే ఇలాంటి అభిప్రాయాలెన్నో కనిపిస్తాయి. ఇవన్నీ ఆ వాగ్గేయకారునికి వేంకటేశ్వరతత్త్వంలో కనిపించిన వివిధభంగిమలు. భగవంతుణ్ణి అనేక నామాలతో, అనేకరూపాలతో కీర్తించినా, దేశంలోని అనేక వైష్ణవదైవాలను కీర్తించినా అన్నమయ్య వారందరిలో దర్శించింది శ్రీనివాసుణ్ణే! ఆయన వర్ణించిన దశావతారాలలో ప్రతి అవతారమూ శ్రీనివాసమయమే!

దశావతారాలను వర్ణించిన సందర్భాల్లో అన్నమయ్య మానవునినడవడికలోని వివిధాంశాలను భావించుకొని, అవతార మూర్తులలో ఆ భావాలను పొదిగినట్లు కనిపిస్తుంది.

**సంసారమే మేలు సకలజనులకును**
**కంసాంతకునిభక్తి గలిగితే మేలు ॥పల్లవి॥**

**వినయపుమాటల విద్య సాధించితే మేలు**
**తనిసి యప్పులలోన దాఁగకుంటే మేలు**
**మునుపనే భూమి దన్నుమోచి దించకుంటే మేలు**
**వెనకొన్న కోపము విడిచితే మేలు...**

ఇలా సాగే సంకీర్తనలో సంసారులకైనా కంసాంతకుని (శ్రీకృష్ణుని) మీద భక్తి కలిగితే మేలని చెపుతూ, దేవుడు చేసిన గొప్పకార్యాలను మానవులు ఎలా అర్థం చేసుకొని ఆచరించాలో వివరించాడు. దేవుడు సోమకాసురుణ్ణి సంహరించి విద్యను (వేదాలను) సాధించాడు. మానవులకు సాధ్యంకాని కార్యమిది. మానవులు (గురువుదగ్గర) వినయంగా ప్రవర్తిస్తూ (మాట్లాడుతూ) విద్యనేర్చుకోవాలి. అంతేగాని విద్యకోసం హింస పనికిరాదు.

దేవుడు అప్పుల (నీళ్ల)లో దాగి మందరపర్వతాన్ని మోశాడు. అందువల్లనే దేవతలకు అమృతం సిద్ధించింది. మానవులు నీళ్లలో దాగి ఉండ నవసరం లేదు. అప్పులలో (ఋణాలలో) దాగ కుండా (మునగకుండా) ఉంటే మేలు. దేవుడు భూమిని (భూదేవిని)మోసి తరువాతదించాడు. మానవులు అలాకాకుండా భూమిని దించకుండా (వదలకుండా వ్యవసాయం చేసుకొంటూ) ఉంటే మేలు. స్తంభంనుండి ఉద్భవించిన దేవుడు అమితమైన కోపంతో హిరణ్యకశిపుణ్ణి సంహరించాడు.

**మానవులు అలాకాకుండా ఎప్పటికప్పడు కోపాన్ని విడిచిపెట్టడం మేలు. ఇలాగే ఒకరిని (వామ నునివలె) యాచించకుండా ఉండాలని, పరశు రామునివలె మాటిమాటికి ప్రాణులను చంపకుండా ఉండాలని, రామునివలె ఎక్కువగా కష్టాలు పడ కుండా ఉండాలన్నాడు. శ్రీకృష్ణుడు ఇతరుల శాప నార్థాలకు గురి అయ్యాడు. మానవులు ఇతరుల శాపనార్థాలకు గురి కాకుండా ఉండడం మేలు.**

త్రిపురాసురసంహారంకోసం దేవుడు త్రిపురాంగలను భంగపరిచాడు. మానవులు ఇతరస్త్రీలను భంగపరచకుండా ఉండడం మేలు. అధర్మాన్ని రూపుమాపడానికి దేవుడు బుద్ధి పూర్వకంగా పక్కదారులు తొక్కాడు (కల్కి). మానవులు అలా పక్కదారులు తొక్కకుండా ఉంటే మేలు.

దేవుడు సర్వసమర్థుడు కాబట్టి ఆ పనులు చేశాడు. దానివల్ల లోకానికి మేలు జరిగింది. దేవుడు చేసిన పనులను మానవులు చేయగల సమర్థులు కారు. ఒకవేళ చేసే ప్రయత్నం చేసినా ఆత్మవినాశం తప్పదు. పైగా లోకానికి చెడు జరుగు తుంది. కాబట్టి మానవులు ఎలాంటి పనులు చేస్తే మేలు కలుగుతుందో అలాంటి పనులనే చేయాలి. అప్పుడే జీవితం శాంతిమయం అవుతుంది. దీనికి ఒడిదుడుకులు లేని మనో నిబ్బరం కావాలి. అందువల్ల మానవుడు -

**అరుదైన శ్రీవేంకటాద్రి విభునిఁ గొల్చి**
**యిరవై నిశ్చింతుఁడైతే నిన్నిటాను మేలు** -అన్నాడు అన్నమయ్య.

దశావతారసంకీర్తనలలో అన్నమయ్య రెండు ప్రయో జనాలు దృష్టిలో పెట్టుకొన్నట్లుంది. దశావతారాలను పేర్కొని అవన్నీ శ్రీనివాసునిపూర్వపు అవతారాలేనని స్ఫురింపజేయడం మొదటిప్రయోజనం. మానవసమాజాన్ని, అందునా మానవ స్వభావాన్ని రూపు కట్టించడం రెండవ ప్రయోజనం. అలా దశా వతారకీర్తనలలోనూ అన్ని అంశాలుంటాయి. ఒక సంకీర్తన లోని అంశాన్ని మరొకకీర్తనలో తడవకపోవడం ఆయన ప్రత్యేకత.

ఎంత ప్రయత్నించి, ఎన్నిపాట్లుపడినా కర్మానుసారం లభించవలసిన మంచిచెడులే లభిస్తాయని చెప్పే మానవ జీవితాంశాన్ని 'ఏమి చేయవచ్చుఁ గర్మ మిచ్చినంతేగాని...' అనే సంకీర్తనలో దశావతారాలను సమన్వయపరచి వివరించాడు - అన్నమయ్య.

**ఇట్టునట్టు మిట్టిపడ్డ యించుకంతాలేదు, వీఁపు**
**బట్టగట్ట మోపుమోఁచి పాటువడ్డా లేదు...**

అంటూ సాగేసంకీర్తనలో..

మానవపరంగా చేసినపనికి కర్మానుసారం ఫలం లేకపోవడం- అదేపని చేసి, భగవంతుడు లోకోత్తరమైన ఫలాన్ని సాధించడం అనే విషయం స్పష్టం చేయబడింది. దేవుడికి కర్మ అంటకపోవడం దీనికి కారణమంటాడు- అన్నమయ్య. నీటిలో కనిపించే చేప అటూ ఇటూ తిరుగుతూ- పైకి లేస్తూ- మళ్లీ మునుగుతూ ఉంటుంది. దీనివల్ల ప్రయోజనం ఏముంది? ఇలాంటి చేప (మత్స్య) అవతారం ధరించి, భగవంతుడు నీళ్లలో మునిగి, రాక్షసుడు అపహరించిన వేదాలను బయటకు తెచ్చి, వేదవిద్యను కాపాడినవిషయం లోకోత్తరం. ఈ సంకీర్తన రెండవ పాదంలో నేలను తవ్వి పైకెత్తడం అనే క్రియద్వారా భూదేవిని ఉద్ధరించిన ఆదివరాహరూపం స్ఫురిస్తూంది.

ఇలా ఎన్నో లౌకికవిషయాలను అన్నమయ్య దశావతారసంకీర్తనలలో చూపిస్తూ, మానవజీవిత దశలను, మానవ ప్రవర్తన ఉండవలసిన విధా నాలూ వివరించాడు.



పచ్చతోరణం

# అపురూపం ఆనందనిలయం

- డా॥ ఈమని శివనాగిరెడ్డి, 98485 98446

"ప్రాసాదం పురుషం మత్వా పూజయేత్ మంత్ర విత్తమః"

ప్రాసాదం అంటే దేవాలయం, పురుషుని (భగవంతు) ప్రతిరూపంగా పూజ లందు కొంటుందని శిల్పరత్న మనే గ్రంథం పేర్కొనింది.



అంతేకాదు–



'గర్భగృహం తు దేవస్యశరీరం ఇతి స్మృతమ్'

గర్భగృహం, దానిమీదున్న శిఖరం దేవునిరూపం తప్ప మరొకటి కాదు.

'దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవ స్సనాతః'

దేహమే దేవాలయమని, జీవుడు దేవుడని ఉపనిషద్వాక్యం. దానికి మరిన్ని వివరాలు జోడించి, దేవుడు నిలబడినపుడు, పరుండినపుడు ఆలయంయొక్క నిలువు రూపం, గర్భాలయంనుంచి గోపురం దాకా ఎలా కనిపిస్తాయో కూడ శాస్త్రాలు పేర్కొన్నాయి.





**ఉపపీఠం చరణాకారమ్ అధిష్ఠానం జానుమండలమ్ ।**
**కుంభపంజర సంస్థానం నాభిశ్చోదర సమానమ్।**
**పాదవర్గం కరాకారం ప్రస్తరం బాహుమూలకమ్।**
**తత్‌కంఠం గళ మిత్యుక్తం శిఖరం ముఖమేవచ।**
**ఉష్ణీషాంతం శిఖాచైవ మహానాసీ చ నాసికా।**
**నేత్రానాం క్షుద్రనాశ్య శ్చ విశ్వరూపమితిస్మృతమ్.**

ఆలయాన్ని నిలువుగా పరిశీలిస్తే, భూమిమీద ముందుగా నిర్మించే ఉపపీఠం-భగవంతుని పాదానికి ప్రతీక. అధిష్ఠానం-మోకాళ్లకు, కుంభపంజరం-(గోడలపై ఒక అలంకరణ) నాభికి, పాదవర్గం (గోడలు) చేతులకు, ప్రస్తరం- (కప్పు) బాహుమూలాలకు, కంఠం-గళభాగానికి, శిఖరం-ముఖానికి, ఉష్ణీషం కిరీటం-శిఖకు, మహానాసి- ముక్కుకు, క్షుద్రనాసులు- కళ్లకు ప్రతిరూపాలని అర్థం.

ఇకస్వామి వారు పడుకొన్న (శయన)రూపంలో ఉన్నపుడు, దేవాలయం ఈవిధంగా గోచరిస్తుంది.

**గర్భగృహం శిరః ప్రోక్తం అంతరాళం గళం తథా**
**మండపం కుక్షిరిత్యాహుః ప్రాకారం జానుజంఘయోః**
**గోపురం పాదమిత్యాహుః ధ్వజో జీవ స్సముచ్యతే**

భగవంతుడు (అర్చామూర్తి) శయన రూపంలో ఉన్నపుడు, గర్భగృహం-శిరస్సుగానూ, అంతరాళం-గళం(కంఠం)గానూ, మండపం- పొట్టభాగంగానూ, తొడ మోకాళ్లు-(ప్రాకారంగానూ, గోపురం-పాదంగానూ కనిపిస్తాయని చెప్పబడింది.

ఈ విషయాలను మనస్సులో నింపుకొని తిరుమల శ్రీవారి ఆలయంలోకి ప్రవేశించి, ఒక్కసారి ప్రదక్షిణం చేసి, ఆలయాన్ని నిలువుగానూ, గర్భాలయంనుంచి గోపురం (మొదటి ప్రాకారం లోపలివరకూ చూచినవారికి, శ్రీనివాసుడు నిలబడి ఉన్నశయనించి ఉన్న రూపం ముమ్మూర్తులా కనబడుతుందనటంలో అతిశయోక్తి లేదు.



శ్రీవారి సుప్రభాతం



శ్రీ వేంకటేశ్వరస్వామివారు

## 2016, ఫిబ్రవరి 6 నుండి 12 వరకు
# హైదరాబాదులో జరిగిన శ్రీవారి వైభవోత్సవదృశ్యమాలిక



ఉత్సవంలో పాల్గొన్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడు, కేంద్రమంత్రి శ్రీ ఎం.వెంకయ్య నాయుడు, కేంద్రమంత్రి శ్రీ బండారు దత్తాత్రేయ, తి.తి.దే. బోర్డుసభ్యులు శ్రీ భానుప్రకాష్‌రెడ్డి.



ఉత్సవంలో పాల్గొన్న తెలంగాణ రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ కె.చంద్రశేఖర్‌రావు, కేంద్రమంత్రి శ్రీ ఎం.వెంకయ్య నాయుడు, కేంద్ర మంత్రి శ్రీ బండారు దత్తాత్రేయ, తి.తి.దే. బోర్డు సభ్యులు శ్రీ భానుప్రకాష్‌రెడ్డి.



ఉత్సవంలో పాల్గొన్న తి.తి.దేవస్థానం బోర్డు సభ్యులు శ్రీ డి.పి.అనంత, శ్రీమతి ఇ.సుచిత్ర, తి.తి.దే. పాలకమండలి అధ్యక్షులు శ్రీ చదలవాడ కృష్ణమూర్తి, తి.తి.దే. సంయుక్త కార్యనిర్వహణాధికారి (తిరుపతి) శ్రీ పోల భాస్కర్, ఐ.ఏ.ఎస్., తదితరులు



శ్రీవారి సహస్రకలశాభిషేకం

రథసప్తమి (14-02-2016)
సప్తవాహనసేవలలో
సప్తగిరీశుడు


సూర్యప్రభవాహనం

చిన్నశేషవాహనం


గరుడవాహనం


హనుమద్వాహనం


చక్రస్నానం


కల్పవృక్షవాహనం


సర్వభూపాలవాహనం


చంద్రప్రభవాహనం


రథసప్తమి సందర్భంగా ఆదిత్యహృదయం మరియు సూర్యాష్టకం పఠిస్తున్న తిరుపతి బాలమందిరం విద్యార్థినీవిద్యార్థులు

# తిరుమల
# శ్రీవారి తెప్పోత్సవం
## 2016 మార్చి 19 నుండి 23 వరకు



19-03-2016
శ్రీ కోదండరామస్వామివారికి



20-03-2016
శ్రీ కృష్ణస్వామివారికి



21 నుండి 23 వరకు శ్రీవారికి



తిరుపతి ఎస్.వి. డైరీ ఫారంలో జరిగిన సంక్రాంతి సంబరాలు



వేటూరి ప్రభాకర శాస్త్రి గారి 128వ జయంతి సందర్భంగా వారి విగ్రహానికి పూలమాల అలంకరిస్తున్న తి.తి.దే. అధ్యక్షులు





తిరుమలలో జరిగిన పురందరదాసుల ఆరాధన ఉత్సవాలు, సందేశం అందిస్తున్న కార్యనిర్వహణాధికారి



జనవరి 26 రిపబ్లిక్‌డే సందర్భంగా రాష్ట్ర గవర్నరు నుండి బహుమతి స్వీకరిస్తున్న తి.తి.దే. ఇంజనీరింగ్ అధికారులు



రెండవ బహుమతి పొందిన తి.తి.దే. శకటం.




పడికావలి గోపురంగా పేరుగాంచిన మహాద్వారం, ఆనందనిలయ ప్రవేశానికి మొదటమెట్టు. మహాగోపురద్వారం గడపకు ముందు అటూ ఇటూ చిన్నపరిమాణంలో ఉన్న శంఖనిధి, పద్మనిధి కంచుబొమ్మలు సందర్శకులకు స్వాగతం పలుకుతున్నాయి. అక్కడే భక్తుల సందర్శనార్థం ఉంచిన అనంతాళ్వార్ (తెలియక శ్రీవారిని గాయపరచిన) గడ్డపార, చారిత్రకగాథకు సాక్షీభూతం.






లోనికి ప్రవేశించగానే కుడి, ఎడమవైపున గల విజయనగర రాజులు, రాణుల విగ్రహాలు దర్శనమిస్తాయి. కుడివైపున, విజయనగర సమ్రాట్టు శ్రీకృష్ణదేవరాయలు ఇద్దరు రాణులు తిరుమలదేవి, చిన్నాదేవిలతో కలసి ఉన్న నిలువెత్తు కంచుప్రతిమలు ఉండడంవల్ల ఈ మండపాన్ని ప్రతిమామంటపమంటారు. ఇలా గోపురంవెనుక మండపం ఉండటం వైష్ణవసంప్రదాయంలో భాగం.

కృష్ణాజిల్లా అవనిగడ్డలోని లక్ష్మీనారాయణస్వామి దేవాలయ రాజగోపురం వెనుక కూడ ఒక మండపముంది. కృష్ణరాయలు, తిరుమలదేవి, చిన్నాదేవి, శ్రీవారికి భక్తిపారవశ్యంతో మొక్కుతున్నట్లుగా పోత పోయించుకొని, ఇక్కడ నిలబెట్టి తన భక్తిప్రపత్తులను ప్రకటించుకొన్నాడు.





ద్వారానికి ఎడమవైపున అంజలి ఘటిస్తూ ఉన్న మరోవిగ్రహం ఆరవీటితిరుమలరాయల నాలుగవ కుమారుడైన వెంకటపతిరాయలు (క్రీ.శ. 1585–1614). పరిస్థితుల ప్రభావంవల్ల రాజధానిని పెనుగొండనుంచి చంద్రగిరికి మార్చి, అక్కడ రెండు రాజప్రాసాదాలు (రాణీమహల్, రాజమహల్) నిర్మించి, చరిత్రలో నిలిచిపోయాడు. వెంకటపతిరాయల విగ్రహానికి దక్షిణంగా ఉన్న రెండు రాతిప్రతిమలు శ్రీకృష్ణదేవరాయల తరువాత విజయ నగర సింహాసనాన్ని అధిష్ఠించిన, అచ్యుతదేవరాయలు, అతని రాణి వరదాజియమ్మలవి. క్రీ.శ. 1529 సం౹౹ చివరినాళ్లలో, తిరుమలకొండమీద, గర్భాలయంలో ముందరే, అచ్యుతరాయల పట్టాభిషేకం జరిగిందని చరిత్రకారులు భావిస్తున్నారు. ఈయనకూడ కృష్ణరాయని మాదిరిగా తిరుమలదేవాలయానికి భూరివిరాళాలు ఇచ్చాడు.




ధ్వజస్తంభానికి దక్షిణంగా ఉన్న తిరుమలరాయమండపం, (ఊంజల్, మండపం)లో వాయవ్యదిశలో రాజస్థాన్‌కు చెందిన తోడర్ మల్లు అని పిలువబడిన లాలాఖేమరామ్, ఆయనతల్లి, మోహనబీబీ, భార్య పితాబీబీల విగ్రహాలున్నాయి. వేంకటేశ్వరుడంటే భక్తిభావాలతో ముకుళిత హస్తాలతో లోహకవచం కలిగిన ఈ ముగ్గురి ప్రతిమలు భక్తులలో భక్తిభావాన్ని పెంపొందిస్తుంటాయి. కంచి వరదరాజస్వామి ఆలయంలో లాలాఖేమరామ్ ఒక మండపాన్ని నిర్మించాడు. దానికి లాలాఖేమరామ మండపం అని పేరు.





ధ్వజస్తంభ బలిపీఠాలున్న ధ్వజమండపాన్ని దాటి, శ్రీవారి రెండోగోపుర ద్వారమైన వెండివాకిలిద్వారా విమానప్రదక్షిణంలోకి ప్రవేశించగానే ఎడమవైపు ముందుగా వరదరాజస్వామిఆలయం కనిపిస్తుంది. ఇందులో, కాంచీపురాన్ని మ్లేచ్ఛులు దాడి చేసినప్పుడు అక్కడవున్న వరదరాజస్వామి విగ్రహాన్ని ఇక్కడ ప్రతిష్ఠించి భద్ర పరచారంటారు. తరువాతగల వంటశాల (పోటు)లోపల మడప్పడినాచ్చియార్ అని పిలువబడిన వకుళమాతఆలయం, వంటశాలకు ఎదురుగా బంగారుబావి, దాట గానే, చక్కటి శిల్పకళ ఉట్టిపడే స్తంభాలతో అలరారే కల్యాణమండపం కనిపిస్తుంది.





తర్వాత యాగశాల, పరకామణి, పశ్చిమప్రాకార మండపం, చందనపుఅర, అదిదాటగానే కన్పించేదే విమాన వేంకటేశ్వరస్వామివిగ్రహానికి దారిచూపే సూచిక. ఏకారణం చేతనైనా, భక్తులకు మూలమూర్తి దర్శనం కాకపోతే విమాన వేంకటేశ్వరుని దర్శించుకొని తరించేవారు. వ్యాసతీర్థులవారు పన్నెండేళ్లపాటు తిరుమలకొండమీద నివసించి, ప్రతిరోజూ విమానవేంకటేశ్వరుణ్ణి దర్శించారని చరిత్ర. ఇప్పటిదాకా విమానప్రదక్షిణం గురించి చెప్పుకున్నాం. అసలు విమాన మంటే ఏమిటో తెలుసుకొందాం.

కేరళ రాష్ట్రానికి చెందిన 17వశతాబ్దికి చెందిన శ్రీకుమారుడు వ్రాసిన 'శిల్పరత్నం' అనేగ్రంథంలో 'నానా మానవిధానత్వాత్ విమానం శాస్త్రతఃకృతమ్' అని విమానాన్ని నిర్వచించాడు. అంటే అనేకరకాలైన కొలతలలో నిర్మించ బడిందని అర్థం. దేవాలయం కప్పులపైన నిర్మించబడే కట్ట డాన్నే విమానమని, శిఖరమని పిలుస్తారు. గర్భాలయంపైన నిర్మించే కట్టడాన్ని విమానమనీ, ప్రాకారద్వారంపై నిర్మించే కట్టడాన్ని గోపురమనీ అంటారు.

తిరుమల వేంకటేశ్వరాలయగర్భగృహం పైనున్న విమానాన్ని ఆనందనిలయమని పిలుస్తారు. పురాణాల్లో చూచాయగా కన్పించే వివరాలనుబట్టి, మేరుపర్వతపుత్రుని పేరు ఆనందుడు. పందెంలో భాగంగా, ఆదిశేషుడు ఆనందపర్వతాన్ని చుట్టుకోగా, బలప్రదర్శనలో భాగంగా, వాయుదేవుడు, ఆదిశేషునితో పాటు ఆనందపర్వతాన్ని ఊది, స్వర్ణముఖీనదీ తీరంలో పడేట్లు చేశాడనీ, అలా పడిన ఆది శేషుడు, శేషాచలం అనే ఏడుకొండలుగా, రూపొందాడనీ శేషాచలంపైన ఆనందుడు ఉన్నందున ఆప్రదేశానికి ఆనందనిలయమని పేరువచ్చిందనీ, అందులో శ్రీహరి, శ్రీనివాసుని రూపంలో నివసించాడనీ, అందువల్ల, శ్రీనివాసుడైన, శ్రీవేంకటేశ్వరుడున్న గర్భాలయంపై నిర్మించిన విమానానికి ఆనందనిలయమని పేరు కలిగిందని చెబుతారు.

మూడంతస్తులవిమానం, రెండంతస్తుల వరకూ చదరంగానూ (నాగరశైలి), దానిపైనగల కంఠం వృత్తంగానూ (వేసరశైలి) నిర్మించబడింది. ఇటుకలు, గారతో నిర్మించిన ఈ విమానంపైన రాగిరేకులను తొడిగి, దానిపై బంగారుమలాము పెట్టించడంవల్ల, ఆనందనిలయం ధగధగలాడిపోతుంది. భవిష్యోత్తరపురాణంలో–

**"తత ఆనందనిలయే తొండమాన్ నృపతినిర్మితే విమానాగ్రే శ్రీనివాసో రరాజ భగవాన్ హరిః"** అని చెప్పబడింది. తొండమాన్‌చక్రవర్తి, నిర్మించిన ఈ ఆనందనిలయ విమానం పైన శ్రీనివాసుడున్నాడనీ, ఆయనే విమానవేంకటేశ్వరునిగా కీర్తించబడుతున్నాడని అర్థం.

బంగారురేకులతో మెరిసిపోయే ఈ విమానానికి 800 వందల సంవత్సరాల చరిత్ర ఉంది. క్రీ.శ. 1245వ సంవత్సరంలో మొదటి సారిగా విమానంపై బంగారుతాపడం జరిగింది. చోళరాజుల సామంతుడుగా స్థానిక తొండైమండల పాలకుడైన వీరనరసింగదేవయాదవరాయలు (క్రీ.శ.1205–1262) చోళుల తర్వాత రాజ్యానికి వచ్చిన పాండ్యుల సామంతుడైనాడు. క్రీ.శ. 1245వ సం॥ లోనో–అంతకు కొంచెం ముందో, చతుర్వేదిమంగళ మనే గ్రామానికి చెందిన తిరుపులానిదాసర్ ఆలయజీర్ణో ద్ధరణకు ముందుకు వచ్చి, వీరనరసింగదేవ యాదవరాయల అనుమతి కోరాడు. అంగీక రించిన యాదవరాయలు, శ్రీవారిఆలయంపై అప్పటికే చెక్కి ఉన్న చోళులశాసనాలనకళ్లు, జీర్ణోద్ధరణ తరువాత మళ్లీ చెక్కాలన్న షరతు పెట్టాడు. అందుచేత నాలుగు శాసనాలైనా మనకు దక్కాయి. అదే సందర్భంలో (సుమారు క్రీ.శ. 1245) వీరనరసింగ దేవయాదవరాయలు తులాభారం తూగి, ఆ వచ్చిన బంగారంతో ఆనందనిలయం విమానంపై పూత పూయించిన తొలిరాజుగా





గుర్తింపు పొందాడు. దాదాపు ఇదేకాలంలో జటావర్మసుందరపాండ్యుడు క్రీ.శ. 1260 ప్రాంతంలో ఆనందనిలయం విమానంపై బంగారుకలశాన్ని ప్రతిష్ఠించాడు మహాద్వార గోపురం మీదున్న శాసనంలో, వీరనరసింగ దేవయాదవరాయలు బంగారుతాపడంచేసి, తిరుమలక్షేత్రాన్ని సురగిరితో సమానంగా చేసినట్లు చెప్పబడింది.



తిరుమామణి మండప గంటలు

తరువాత క్రీ.శ. 1359 కుమార కంపరాయల సేనానిగా ఉండి, చంద్రగిరిని ఏలుతున్న సాళువమంగిదేవమహారాజు వేయించిన శాసనంలో "స్వస్తిశ్రీ జయాభ్యుదయశకవరుషంబులు 1281 అగునేటి వికారి సంవత్సర ఆషాఢశుద్ధదశమి మందవారాన స్వస్తిశ్రీమన్మహామండలేశ్వర, మీసర గండేశ్వరమంగిదేవమహారాజులు తిరుమలదేవరకు..... సువర్ణాది శిఖరమును ఎత్తించెను" అని పేర్కొనబడింది.

మళ్ళీ, క్రీ.శ.1417లో మూడోసారి ఆనందనిలయం, శ్రీవారి విమానాన్ని బంగారుమయం చేసినట్లు శాసనముంది. దానిప్రకారం, ఇమ్మడిదేవరాయలమంత్రి మల్లన్న (ఇతణ్ణే మాధవదాసర్ అని కూడా పిలుస్తారు), ఆలయంలో తిరుమామణి మంటపాన్ని నిర్మించి, విమానానికి మరోసారి బంగారుపూత పూయించాడు.

నాలుగోసారి శ్రీకృష్ణదేవరాయలు, ఆనందనిలయవిమానానికి బంగారుపూతేపూయించినట్లు క్రీ.శ.1519వ సం॥ శాసనం తెలియజేస్తుంది. క్రీ.శ.1517లో శ్రీకృష్ణదేవరాయలు కళింగ జైత్రయాత్ర విజయవంతంగా ముగిసిన సందర్భంగా స్వామివారికి కృతజ్ఞతాపూర్వకంగా 'తిరువెంకటముడయాన్ విమానత్తుకు పొన్‌పూసి విత్తార్' శ్రీవారి ఆనందనిలయ విమానానికి బంగారు పూసినాడని ఉంది.

శ్రీకృష్ణదేవరాయల తర్వాత, క్రీ.శ.1630 ప్రాంతంలో, కంచికోటి కన్యకాదానం తాతాచార్యులు మొదట వేంకటపతిరాయలపాలనలో, ఐదోసారి ఆనందనిలయానికి బంగారుతాపడం చేయించాడు.

అటు తరువాత 1908, సెప్టెంబరు 30వ తేదీన హత్తీరాంజీ మఠానికి చెందిన రామలక్ష్మణ్‌దాస్ ఆరోసారి బంగారుపూత పూయించాడు. తరువాత, 27.8.1958న ఏడోసారి శ్రీవారి ఆనందనిలయానికి తి.తి.దే.వారు సుమారు 18లక్షలు ఖర్చుపెట్టి బంగారుమయం చేశారు.

తర్వాత ఎనిమిదోసారి తిరుమల తిరుపతి దేవస్థానమే 2006, ఆగష్టు నెల 20వ తేదీన బంగారుపూతపూయించి తిరుమల శ్రీవారి ఆనందనిలయాన్ని నిత్యనూతనంగా మెరిసేట్లు చేశారు.

ఇలా ప్రకాశవంతమై బంగారుకాంతులీనుతున్న విమానంపైన దక్షిణంవైపునుంచి వరుసగా వరాహమూర్తి, నరసింహస్వామి, విమాన వేంకటేశ్వరుడు, వైకుంఠనారాయణమూర్తి విగ్రహాలను చూచి, ఆలయం బయటికి వచ్చినవారికి నిజంగా ఆనందం కలుగుతుంది. కాబట్టి శ్రీవారివిమానాన్ని 'ఆనందనిలయం' అని పిలవడం సార్థకం.






# పురాణం మనశ్శాంతిని ఇస్తుంది

- వైద్యం వేంకటేశ్వరాచార్యులు, 9989679681

**బ్రహ్మాండపురాణం మొదలైన మహాపురాణాలనూ, మహాభారతాన్నీ, బ్రహ్మసూత్రాలనూ రచించినాకూడా వేదవ్యాసుని మనస్సుకు సంతృప్తి, సంతోషం కలుగలేదు. నారదుని ఉపదేశంవల్ల శ్రీమహాభాగవతాన్ని నిర్మించి, వ్యాసుడు మనశ్శాంతిని పొందగలిగాడు. అందుకే భాగవతాన్ని వ్యాసశోకనివర్తకం అంటారు.**

భారతీయసంస్కృతి, సంప్రదాయాలకు మూలస్తంభాలు - రామాయణ, భారత, భాగవతాలు. రామాయణం భారతీయ కుటుంబవ్యవస్థకు ఆదర్శం, భారతం రాజకీయచతురతకు దర్పణం, భాగవతం ప్రేమభక్తిసామ్రాజ్యానికి మహాద్వారం. వీటిని రచించిన వాల్మీకి, వ్యాసులు భారతీయధార్మికదర్శనానికి దర్శకులు. వేదమంత్రాలకు కథారూపాలు రామాయణభాగవతాలు. ఈ విషయం మంత్రరామాయణం, మంత్రభాగవతం అనే గ్రంథాలు సుస్పష్టం చేశాయి.

భా-గ-వ-త అనే నాలుగు అక్షరాలకూ పూర్వులు కొన్ని అర్థాలు చెప్పారు. అందులో ఒకటి-

శ్లో॥ భా శబ్దః కీర్తివచనో, గ శబ్దో జ్ఞానవాచకః ।
సర్వేష్టవచనో వ శ్చ, తో విస్తారస్యవాచకః ॥
కీర్తేః జ్ఞానస్య సర్వేష్టస్య చ విస్తరణాదికమ్।
అస్య భాగవతం నామ శ్రీవ్యాసే నేతి కీర్తితమ్ ॥
- కౌషీతకీసంహిత *5-43-54-1*

భా=కీర్తి, గ=జ్ఞానం, వ=సర్వేష్టవచనం, త=విచార వాచకం. కీర్తిజ్ఞానసర్వాభీష్టాల్నీ విస్తరింపజేసి, భక్తిని ఇస్తుంది కనుక భాగవతం అన్నారు.

భాగవతం ఒకకల్పవృక్షం. ద్వాదశ (12) స్కంధాలు కల్పవృక్షశాఖలు. పన్నెండుస్కంధాలలోని 335 అధ్యాయాలు ఆ కల్పవృక్ష ఉపశాఖలు. (ప్రథమస్కంధంలో 19 అధ్యాయాలు, ద్వితీయంలో 10, తృతీయంలో 33, చతుర్థంలో 31, పంచమంలో 26, షష్ఠంలో 19, సప్తమంలో 15, అష్టమంలో 24, నవమంలో 24, దశమంలో 90, ఏకాదశంలో 31, ద్వాదశస్కంధంలో 13 అధ్యాయాలు- వెరసి 12 స్కంధాలలో 335 అధ్యాయాలు) అధ్యాయాలు అనే ఉపశాఖలలో 18000 శ్లోకపత్రాలు. ఇలా భాసిల్లిన భాగవతకల్పవృక్షం శుకాలాపాభిరామమైన కృష్ణభక్తి రసాలవాలం. (అధ్యాయాలలోని శ్లోకసంఖ్యలో ప్రక్షిప్తాలున్నాయనటంవల్ల అభిప్రాయ భేదాలున్నాయి.)

నదులలో గంగ, దేవతలలో అచ్యుతుడు, వైష్ణవులలో శంభుడు, పురాణాలలో భాగవతం ప్రముఖంగా ప్రాముఖ్యాన్ని సంతరించుకొన్నవి.

శ్రీకృష్ణభగవానుడు ద్వాపరయుగం చివరన ఉద్ధవుని ప్రేమపూర్వక అభ్యర్థనమేరకు తన దివ్యతేజస్సును భాగవతంలో నిక్షేపిస్తాడు. అందువల్ల శ్రీభాగవతం భగవానుని ప్రత్యక్ష వాఙ్మయమూర్తి. శ్రీకృష్ణుని దివ్యమంగళవిగ్రహంగా భాగవతులు భాగవతాన్ని భావిస్తారు. భారతీయఆస్తికజనులకు భాగవతం కేవలం ఒకపురాణంమాత్రమే కాదు, ఆ యశోదానందనుని సుందరస్ఫురద్రూపంగా భాసిస్తుంది. శ్రీకృష్ణపరమాత్ముని పాదాది దివ్యాంగాలు భాగవతంలోని ప్రథమాది స్కంధాలుగా భాసించాయి- అంటారు పెద్దలు.

భగవానునిపాదాలు మొదలుకొని, మోకాళ్లవరకు- ప్రథమస్కంధం, మోకాళ్లపైభాగంనుంచి నడుందాకా- ద్వితీయ స్కంధం, బొడ్డు- మూడవస్కంధం, కడుపు- నాలుగవస్కంధం, హృదయం-పంచమస్కంధం, బాహువులు, కంఠం-షష్ఠస్కంధం, సర్వలక్షణసంయుక్తమైన ముఖం- సప్తమస్కంధం, కనులు- అష్టమస్కంధం, నుదురు, కనుబొమలు- నవమస్కంధం, బ్రహ్మ రంధ్రం- దశమస్కంధం, మనస్సు- ఏకాదశస్కంధం, ఆత్మ- ద్వాదశస్కంధం అని కౌషితకీసంహిత 25-8లో పేర్కొనింది.




శ్లో॥ పాదాదిజానుపర్యంతం ప్రథమస్కంధ ఈరితః ।
తదూర్ధ్వం కటిపర్యంతం ద్వితీయః స్కంధ ఉచ్యతే ॥
తృతీయో నాభిరిత్యుక్త శ్చతుర్థ ముదరం స్మృతమ్ ।
పంచమో హృదయం ప్రోక్తం, షష్ఠః కంఠం సబాహుకమ్॥

సర్వలక్షణసంయుక్తం సప్తమో ముఖ ముచ్యతే ।
అష్టమ శ్చక్షుషీ విష్ణోః, కపోలో భృకుటీపరః ॥
దశమో బ్రహ్మరంధ్ర శ్చ మన ఏకాదశః స్మృతః ।
ఆత్మాతు ద్వాదశస్కంధః శ్రీకృష్ణస్యప్రకీర్తితః ॥

– కౌశీతకీసంహితా *25-8.*

భాగవతం-పురాణాలలో మూర్ధన్యం, శాస్త్రాలలో మకుటమణి, వైష్ణవులకు పరమధనం, భగవద్భక్తులకు సర్వస్వం, పరమజ్ఞానులకు నిర్మలజ్ఞాననిధి. భాగవతంలో భగవానుని సాక్షాత్కారఉపాయం ప్రదర్శితం. అందువల్ల భాగవతం పురాణసమ్రాట్టుగా స్థానం సంపాదించుకుంది.

పాద్మ, బ్రాహ్మ అనే రెండుపురాణాలనూ చామరాలుగా వారాహపురాణం వీవగా, బ్రహ్మాండపురాణం ఛత్రాన్ని పట్టగా, స్కందపురాణం సంస్తుతిచేయగా, శ్రీవైష్ణవులు సేవింపగా వారికోరికలన్నీ తీరుస్తూ ఉన్న 'భాగవతపురాణసమ్రాట్'కు విజయం కలుగుగాక!

ఆ.వె. వేదకల్పవృక్షవిగళితమై శుక –
ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవతపురాణఫలరసాస్వాదన
పదవి గనుదు రసికభావవిదులు. – భాగవతం *1-35.*

శ్రీకృష్ణుణ్ణి ఎలా చింతించినాకూడా సద్గతి లభిస్తుంది. ఆ కృష్ణుని కథామృతాన్ని అందించే భాగవతపఠనాదులు సద్గతిని సమకూర్చక ఎలా ఉంటాయి?

గోపికలు కామంచేత, కంసుడు భయంచేత, శిశుపాలాదిరాజులు ద్వేషంచేత, యాదవులు సంబంధంచేత,

పాండవులు స్నేహంచేత, నారదాదులు భక్తిచేత మనస్సులో కృష్ణభగవానుణ్ణి నిల్పి, సద్గతిని పొందారు.

భారతంలో భగవద్గీతాదులు ఉన్నాయి. భాగవతంలో వేణుగీత, గోపీగీత, యుగళగీత, శ్రుతిగీత, భ్రమరగీత ఉన్నాయి. ఇవి ఆధ్యాత్మిక నిగూఢవిషయగర్భితాలు. భాగవతం వేదాంత, అధ్యాత్మిక, రసరమ్యగ్రంథరాజం, అందుకని భాగవతం అంత సులభంగా అర్థం కాదు.

భాగవతాన్ని అర్థం చేసుకోవాలంటే బహుశాస్త్ర పరిజ్ఞానంతోపాటు ఆధ్యాత్మిక వేదాంతతత్త్వపరిజ్ఞానం కలిగిన విద్వత్తు అవసరం. అందుకే 'విద్యావతాం భాగవతే పరీక్షా' అన్నారు.

బంగారునిర్మలత్వాన్ని చూడాలంటే అగ్నిపరీక్ష చేయాలి. విలుకాని వీరత్వాన్ని గుర్తించాలంటే యుద్ధం పరీక్ష. విపత్కాలంలోనూ సంయమనంతో, సత్ప్రవర్తనతో ఉండటం గృహిణికి పరీక్ష. విద్యావంతులకు భాగవతాన్ని అర్థం చేసుకోవటం పరీక్ష.

**చతుర్విధపురుషార్థాలనూ ప్రతిపాదించిన భాగవతాన్ని అన్నిపురాణాలలోనూ శ్రేష్ఠమైందని చెప్పారు. 'సర్వేషాం చ పురాణానాం శ్రేష్ఠం భాగవతం స్మృతమ్'**

**- భవిష్యపురాణం**

విద్యావంతుడూ మహాకవీ, మహాపండితుడూ – మీదు మిక్కిలి భాగవతోత్తముడు అయిన బమ్మెరపోతనామాత్యులవారు వ్యాసులవారిసంస్కృతభాగవతాన్ని భావగతంగా అర్థం చేసుకున్నవారిలో ప్రథమగణ్యుడు. సంస్కృతంలోని భాగవతాన్ని 'పురాకృతశుభాధిక్యంబున' 'తెనుగుంజేసెను'. అదీ 'పునర్జన్మంబు లేకుండగ'. తెలుగుభాగవతాన్ని రచించిన పోతనకు పునర్జన్మం లేదు. ఆయన రచించిన భాగవతానికి సాటిగా, పోటిగా భాగవతంకూడా పునర్జన్మ ఎత్తలేదు. చిత్తశుద్ధితో భాగవతాన్ని చదివేవారికికూడా పునర్జన్మం ఉండదు. పోతన భాగవతాన్ని పొగిడేందుకు 'శూలికైన తమ్మిచూలికైన' కూడ సాధ్యం కాదు. భాగవతరచనకు ముందు పోతన శివుణ్ణి ధ్యానించాడు, అయితే రామచంద్రుడు దర్శన మిచ్చి, భాగవతాన్ని పలికించాడు. కృష్ణునిపేర షష్ట్యంతాలు చెప్తూ రచించాడు. ఇలాంటి వైవిధ్యం సంస్కృతాంధ్రాదిభాషలలో మర్కెకడా వినం, కనం. వైష్ణవులలో శివుణ్ణి మించినవారు లేరనేభావంతో ఇంతకు ముందు చెప్పడమైనది. అందుకే భాగవతరచనకు ముందు శైవాచారసంపన్నుడైన పోతన శివధ్యానం చేశాడు. అప్పుడు (శివధనుర్భంగం చేసిన) శ్రీరామచంద్రుడు పోతనకు సాక్షాత్కరించాడు. కృష్ణాంకితపద్యాలతో, శ్రీరామసంబుద్ధితో భాగవతాన్ని రచించాడు–పోతన. శివరామకృష్ణులు భాగవత రచనలో పోతనకు సహకరించారు. ధర్మం, అర్థం, కామం, మోక్షం అనే నాలుగుపురుషార్థాలుకూడా భాగవతంలో చెప్పబడ్డాయి.

మహాభాగవతపురాణం అష్టాదశమహాపురాణాలలో ఒకటి. అష్టాదశపురాణాలపేర్లు కొన్ని పురాణాలలో ప్రస్తావించబడినాయి. నారదీయపురాణం చెప్పిన అష్టాదశపురాణ క్రమంలో భాగవతం ఐదవది. ఉపపురాణాలలో ఒకటైన దేవీభాగవతంకూడా అష్టాదశపురాణాలపేర్లుచెప్తూ భాగవతపురాణాన్ని మూడవపేరుగా పేర్కొనింది.

శ్రీమద్భాగవతం సకలశాస్త్రాలలో ఉత్తమమైంది. జ్ఞానదాయకమైంది. పరస్వరప్రేమను కలిగించటంలో భాగవతానికున్న సముచితస్థానం దేనికీ లేదు. శ్రీకృష్ణలీలాభివర్ణనంలోనూ, భక్తిప్రచారంలోనూ భాగవతం ఎంతోప్రయోజనాన్ని సాధిస్తూనే ఉంది.

ఆధ్యాత్మికదృష్ట్యా భాగవతం ప్రతిపాదించిన ఆత్మజ్ఞానం సార్వజనీనం, సార్వకాలికం. దీనిలో ప్రతిపాదించిన భక్తిమార్గం జనప్రియమైంది. ద్వైత అద్వైత విశిష్టాద్వైతమతాలు అనుసరించే సిద్ధాంతాలలో భేదమున్నాకూడా త్రిమతాలవారూ భాగవతాన్ని ప్రామాణికంగా స్వమతపుష్టికోసం వైదుష్యపూర్ణంగా వ్యాఖ్యానించారు.

శ్రీమద్భాగవతంలో శాక్త, శైవ, వైష్ణవాది సర్వ హైందవమత సమన్వయంకూడా దర్శన మిస్తుందని విజ్ఞులు చెప్తారు. భాగవతంలో 'లలిత' దర్శన మిస్తుందని విజ్ఞులు సోదాహరణగా నిరూపించారు. భాగవతానుసారం భగవత్ప్రాప్తికి సర్వసులభమైనసాధనం ప్రేమే!

సాక్షాత్తు శ్రీకృష్ణునిస్వరూపమైన భాగవతాన్ని వినని వారి, చదువనివారిజీవితం వృథాయేగాక అలాంటివారు 'కలుగ నేటికి? తల్లుల కడుపు చేటు'. వారివల్ల భారతభూమి కళంకిత మౌతుంది. ఈ విషయం ఇలా చెప్పబడింది.

పురాణాలలోని భక్తిధర్మానికి మూలమైనఊట శ్రీభాగ వతంలో ఉందని పెద్దలమాట. అక్కడినుంచి ప్రవహించిన శ్రీకృష్ణామృతమధురధార నదీప్రవాహంలా ప్రవహించి-విష్ణు, పద్మపురాణాలలోకూడా చోటు చేసుకొనింది. ఆ నదీప్రవాహంలో ప్రతిదినం స్నానంచేస్తూ వేలమంది భక్తులు పాపవిముక్తులు అవుతూనే ఉన్నారు.

శ్రీభాగవతంలోని భక్తిరసామృతసారస్వతం అనుప మానమైన సాహిత్యాన్ని సృష్టించింది. పద్మపురాణ ఉత్తరఖండం 193 - 198 అధ్యాయాలలోనూ, స్కంద పురాణంలోనూ, విష్ణుపురాణంలోనూ భాగ వతమాహాత్మ్యం విస్తృతంగా చెప్పబడింది.

శ్రీమద్భాగవతానికి సమానమైంది భారతీయవాఙ్మయంలోనే మరొకటి లేదని ప్రాజ్ఞులమాట. ఇది అతిశయోక్తికాదు. కల్ప వృక్షం కోరినఫలాలను ఇస్తుంది. అయితే మానవలోకంలో కల్పవృక్షం అలభ్యం. భాగ వతపురాణకల్పవృక్షం సులభ్యం. అందువల్ల దీనిమహిమ సర్వత్ర కీర్తించబడింది. అమృతానికన్నా మధుర మైన 'వాచవి' తోపాటు - మనస్సుకు మహానందాన్ని చేకూరు స్తుంది- భాగవతం.

**ఒక పర్యాయం భాగవతం వింటే- అష్టాదశపురాణాలువిన్న ఫలం లభిస్తుంది. అలాగే భాగవత కథాశ్రవణంవల్ల, పఠనంవల్ల అన్నిపాపాలూ తొలగి, ఆయురారోగ్యాలు పుణ్యం లభిస్తాయి.**

శ్రీభాగవతం భగవానునిమధురమయమైన, లీలారుచి రమైన, చేతఃప్రీతిదమైన మహాపురాణం. అందువల్ల భాగవతం జ్ఞానులకు, కర్మిష్ఠులకు, ముముక్షువులకు, విషయాసక్తులకు, భక్తులకు పరమప్రియమైందిగా భాసిస్తుంది. ఈ పురాణం త్రివిధ మైన పాపాలనూ, దుఃఖాలనూ, దారిద్ర్యాలనూ నివృత్తి చేస్తుం దనీ, సర్వాభీష్టాలనూ నెరవేరుస్తుందనీ భారతీయులు విశ్వసి స్తారు. అందువల్ల భారతావనిలో భాగవతం పారాయణ గ్రంథంగా భాసిల్లుతోంది.

భాగవతంలో భక్తి సాంగోపాంగంగా వివేచించబడింది. సంసారసాగరసముత్తరణానికిసరళోపాయం భగవద్భక్తి ఒక్కటే అని భాగవతం నొక్కి వక్కాణించింది. అన్నిదుఃఖాలు కూడా భగవల్లీలా కథాశ్రవణంవల్ల తొలగిపోతాయి, శ్రేయస్సు చేకూరు తుంది. భాగవతశ్లోకం కానీ, శ్లోకార్థం కానీ, శ్లోకపాదం కానీ పాఠం, శ్రవణం చేసినవారికి రాజసూయ అశ్వమేధయాగాలు చేసినఫలం లభి స్తుంది.

భాగవతకథాశ్రవణమాత్రాన్నే విష్ణుభగవానుడు ప్రసన్నుడై భక్తహృదయ పద్మాలను ఆశ్రయించి, ముక్తిని కరతలా మలకం చేస్తాడు. అఖండరూపంతో గంగాప్రవాహం సముద్రాభిముఖంగా ఎలా ప్రవహిస్తుందో - అలాగే భగ వద్గుణశ్రవణమాత్రంచేతనే మనస్సు అవిచ్ఛిన్నంగా హృదయగుహాంతర విరాజ మానుడైన భగవానుడగు పురుషోత్తముణ్ణి పొందుతుంది. అదొక అమందానందమైన అనుభవం!!



**భావగతం అయ్యేటట్లు... భాగవతం చదివితే బాగవుతాం.**

# తప్పక సందర్శించండి

## (ఎస్.వి.మ్యూజియం, తిరుమల)

డా॥ పి.వి.రంగనాయకులు

తిరుమల యాత్ర అంటే శ్రీవారిదర్శనమే. తిరుమలను సందర్శించే భక్తులు తిరుమల యాత్ర తర్వాత తిరుపతిలో ఇతరదేవాలయాలను దర్శించి, మ్యూజియం చూడటానికి సమయం చాలక వెనుతిరుగుతుంటారు. తిరుమలలో ఉన్న సమయం గదులకోసం, దర్శనంకోసం, ఇతరపనుల నిమిత్తం వరుస క్యూలలో ఎక్కువసేపు గడపాల్సి వస్తుంది. ఆ అలసటను అధిగమించాలంటే – తిరుమలయాత్రను మరింత వైవిధ్యభరితంగా మలచుకోవాలనుకుంటే–స్వామివారి దర్శనానికి ముందుకానీ, తర్వాత కానీ ఒక గంట సేపు శ్రీ వేంకటేశ్వరధ్యానజ్ఞానమందిరం(ఎస్.వి.మ్యూజియం)లో గడిపితే విజ్ఞానదాయకంగా ఉంటుంది. గత 1500ల సంవత్సరాలలో ఆలయానికి సమకూరిన ఎన్నో చరిత్రాత్మక వస్తు విశేషాలు ఎస్.వి.మ్యూజియంలో యాత్రికుల సందర్శనార్థం ప్రదర్శించబడుతున్నాయి. ఆ వస్తు విశేషాలను తెలుసుకొని యాత్రికులు మరింత సంతోషాన్ని పొందవచ్చు.

### వరాహస్వామి తామ్రశాసనం

తిరుమలలోని వరాహస్వామిదేవాలయంలో లభించిన ఈ తామ్రశాసనం పురాతనమైంది. ఇటీవలే ఈ శాసనం శ్రీ వేంకటేశ్వర మ్యూజియంకు అందజేయడమైంది. ఈ శాసనంలో గల అక్షరసమూహాలను అనువదించడానికి ఈ శాసనకాలనిర్ణయం చేయడంలో పరిశోధన జరుగుతోంది.


తిరుమల వరాహస్వామి ఆలయంలో లభించిన తామ్రశాసనం

భక్తుల సందర్శనార్థం ఈ వరాహస్వామి తామ్ర శాసనం తిరుమల ఎస్.వి.మ్యూజియంలో ప్రదర్శనకు ఉంచబడింది. వీటితో పాటుగా....



వజ్రకిరీటం తయారీకి వాడిన నమూన కిరీటం

## నమూనకిరీటం

ఒక నమూనకిరీటంకూడ ఇక్కడ ప్రదర్శనలో ఉంచారు. ఈ కిరీటం స్వర్ణకిరీటం తయారీకి నమూనగా వాడినట్లు కనిపిస్తున్నది. ఒక భవనం కట్టాలంటే ఒక చిన్న నమూన తయారు చేసుకొన్నట్లు, ఒక గొప్ప ఆభరణం చేయటానికి ముందుగా రాగి లోహంతో తయారు చేయబడిన నమూనకిరీటం ఇది. మొట్టమొదటి సారిగా తిరుమల మ్యూజియంలో వైకుంఠ ఏకాదశి నుండి దీన్ని ప్రదర్శనకు శాశ్వత ప్రాతిపదికన ఉంచారు.

## శ్రీకృష్ణదేవరాయల కాలంనాటి ధూపగంట

16వ శతాబ్దంలో విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన శ్రీకృష్ణదేవరాయలు ఏడుసార్లు తిరుమలను దర్శించారు. వచ్చిన ప్రతిసారి ఎంతో విలువైన ఆభరణాలను స్వామివారికి అందజేశారు. దాదాపుగా ముప్పైకి పైగా అపురూపమైన ఆభరణాలను వజ్రకిరీటంతో సహా సమర్పించుకొన్నట్లు దేవాలయంలో గల శాసనాలద్వారా తెలుస్తోంది.

కృష్ణదేవరాయలతో పాటు అతని ఇరువురు రాణులు, పురోహితులైన రంగదీక్షితులు, శివదీక్షితులు, నిత్యసేవకులైన మల్లరసు, శాసనలేఖకుడైన శ్రీపతి వెంట ఉండేవారు. అతడు సమర్పించిన ప్రభావళి, కిరీటం, కత్తి మొదలైనవి ఆలయంలోనే ఉండగా – ఒక అపురూపమైన ధూపగంట శ్రీ వేంకటేశ్వరమ్యూజియంలో ప్రదర్శించబడుతున్నది.



క్రీ.శ.16వ శతాబ్దంలో శ్రీకృష్ణదేవరాయలు బహూకరించిన ధూపగంట

ఈ ధూపగంటపై కృష్ణదేవరాయలు స్వయాన ధూపగంటను తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలో అర్చకులుగా ఉన్న శ్రీదేశాయ బొల్లిద్దు గారికి అందజేసినట్లు లిఖించబడి ఉంది.

క్రీ.శ. 1524లో ఈ ధూపగంట ఆలయానికి చేరింది.






# శ్రీకాళహస్తీశ్వరా!

- బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ



ఒక సాలెపురుగు తన నోటిదారాలతో శివునికి ఆలయాలను నిర్మించింది.

ప్రతిక్షణం ఆ ఆలయాలను గమనిస్తూ, సవరిస్తూ నిరంతరం శివచింతనతోనే కాలం గడప సాగింది.

పూర్వజన్మల సంస్కారంచేత ఆ కీటకానికి ఆ వివేకం లభించింది.

సాలెగూడు గుడిగా శివుడు ఉంటాడా! - అని ఆశ్చర్యపోనక్కర్లేదు.

అనంత విశ్వశరీరుడైన విశ్వేశ్వరుడు మనం కట్టినగుడులలోమాత్రం ఉంటాడా! ఉంటాడు. అణువుకంటే అణువూ, మహత్తుకంటే మహత్తూ (అణో రణీయాన్ మహతో మహీయాన్) అయిన ఆ పరతత్త్వం - భక్తుడు ఎక్కడ ఏ రూపంలో ఆవిష్కరిస్తే అక్కడ ఆ రూపంలో నెలకొంటాడు. అందుకే సాలెగూడునుకూడా గుడిగా మన్నించాడు. ప్రమాదవశాత్తూ ఆ దారపుదేవళాలు దగ్ధమైతే, భరించలేక ఆ భక్తకీటకం ప్రాణత్యాగానికే సిద్ధపడగా భక్తవత్సలుడైన భవానీపతి ఆ సాలీడుకు కైవల్యాన్ని అనుగ్రహించాడు.

అదే విధంగా ఒక పాము, ఒక ఏనుగు శివార్చనలో పోటీపడి, తమను తాము అర్పించుకున్నాయి. వాటికీ శివసాయుజ్యం ప్రాప్తించింది.

అప్పటినుంచి ఆ శివుడు 'శ్రీకాళహస్తీశ్వరుడు'గా పేరుపొందాడు.

ఏ రూపమూ లేని లింగంలో
ఆ మూడింటి గుర్తులే రూపంగా గోచరిస్తున్నాయి.
'శ్రీ' అంటే సాలెపురుగు అని ఒక అర్థం.
'కాళం' సర్పం. 'హస్తి' ఏనుగు.
ఈ మూడింటినీ కరుణించడమే కాక, ఆ కారుణ్యలీలను
తనలో చిహ్నాలుగా దాల్చి ప్రదర్శిస్తున్నాడు - పరమేశ్వరుడు.

అంతకు ముందు ఆ ప్రాంతం పేరు గజకాననం.

అక్కడ వసిష్ఠమహర్షికి బ్రహ్మజ్ఞానాన్ని అనుగ్రహించి, యోగలింగంగా వెలశాడు - శివుడు.

ఆ శివుడు ఈ కీటక, జంతువుల కారణంగా కొత్త పేరు తెచ్చుకున్నాడు.

ఏ రూపమూ లేని లింగంలో ఆ మూడింటిగుర్తులే రూపంగా గోచరిస్తున్నాయి. 'శ్రీ' అంటే సాలెపురుగు అని ఒక అర్థం. 'కాళం' సర్పం. 'హస్తి' ఏనుగు. ఈ మూడింటినీ కరుణించడమే కాక, ఆ కారుణ్యలీలను తనలో చిహ్నాలుగా దాల్చి ప్రదర్శిస్తున్నాడు-పరమేశ్వరుడు.

## STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS ABOUT

## SAPTHAGIRI

(MONTHLY)
FORM IV
See Rule 8

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | : | TIRUPATI |
| 2. | Periodicity of its Publication | : | Monthly |
| 3. | Honorary Editor | : | Dr. D.Sambasiva Rao, I.A.S., Executive Officer, T.T.D. |
| 4. | Printer's Name | : | V.Veerabrahmaiah, M.A., B.Ed., |
| | Whether citizen of India | : | Yes |
| | Address | : | Dy.E.O.(Publications & Press), T.T.D., Tirupati. |
| 5. | Editor & Publisher's Name | : | Dr. C. Saila Kumar, |
| | Whether citizen of India | : | Yes |
| | Address | : | Chief Editor, Sapthagiri T.T.D. Journal, Tirupati |
| 6. | Name and address of individuals who own the Newspaper and partners or shareholders holding more than one percent of the Total Capital | | Board of Trustees represented by the Executive Officer on behalf of T.T.D., Tirupati |

I, C. Saila Kumar, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

TIRUPATI
Date : 29-2-2016

(Sd.) C. SAILA KUMAR
Signature of the Publisher

భక్తుల పేర్లే తన పేరుగా, భక్తుల రూపాలే తన రూపంగా గోచరింపజేసే భక్తవత్సలతకు తార్కాణమిది.

అంతేకాదు - తిన్నడనే బోయవాడు ఆ ముక్కంటికి కంటిని సమర్పించి, శివైక్యం చెందాడు. అంతటి అవ్యాజ (ఏ నెపమూలేని) గాఢభక్తికి పరవశించి, ఎవ్వరికీ సులభంగా లభించని సాయుజ్యపదవిని అనుగ్రహించాడు - సదాశివుడు. తన సన్నిధిలోనే కన్నప్ప విగ్రహానికి అర్చన జరిగేలా నియమించి, భక్తుడైన కన్నప్ప వైపే నిత్యం కన్నప్పగించి చూస్తుంటాడు- శ్రీకాళహస్తీశ్వరుడు. ఆ భక్తుల భక్తిలో ప్రేమపూర్వక అర్పణం తప్ప-కోర్కెల బేరసారాలు లేవు.

నిండుభక్తికి పట్టం కట్టిన దివ్యక్షేత్రమిది.

వేదాలు, వాదాలూ, తర్కాలూ, మీమాంసలూ, పాండిత్యాలూ, చర్చలూ, వేషాలూ, భేషజాలూ లేని స్వచ్ఛమైన భక్తికే శివానుగ్రహప్రాప్తి... అనే బోధన ఈ క్షేత్రంలో ప్రత్యక్ష మౌతుంది.

ఈ కథలు, ఈ క్షేత్రం మనకు అనేకసందేశాలు అందిస్తాయి.

ఊహల దారాల నల్లుకొనే మనలోని బుద్ధిశక్తి సాలీడు. సాలెపురుగుకు దానిప్రతిభే ఎక్కువ. మనకు మన ప్రతిభే గొప్ప.

పరమేశ్వరునికి రెండూ సమానమే!

అయితే సాలీడు తన ప్రతిభాపాటవాలను పరమేశ్వరార్పణం చేసింది. మనలోని బుద్ధి శివార్పణం కావడమే సాలీని పూజలోని ఆంతర్యం.

ఇక మనలో బుసలుకొట్టే అహంకారమే సర్పం.

దేహమే నేననే భావనతో కూడిన ప్రవర్తనే గజం.

ఈ అహంకారం, దేహక్రియలు కూడా శివకైంకర్యానికి వినియోగం కావాలి. అందుకు కావలసిన లక్షణమే తిన్నడు.

**మంచిపుస్తకం**

# ఒంటిమిట్ట రామయ్యచరిత్ర

రచయిత : విద్వాన్ కట్టానరసింహులు,
సెల్ : 94413 37542,
పుటలు : 110, సైజు: 1/8 డెమ్మీ,
వెల : రు. 100/-




తిరుపతిలోని కోదండరామస్వామిఆలయం, వాయల్పాడులోని పట్టాభిరామస్వామి ఆలయం, కడపజిల్లా ఒంటిమిట్టలోని కోదండరామస్వామిఆలయం తి.తి.దే. పర్యవేక్షణలో కొనసాగుతున్న ప్రసిద్ధశ్రీరామక్షేత్రాలు. వీటిలో ఒంటిమిట్ట రామాలయానికి నవ్యాంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వ లాంఛనాలు అందుతున్నాయి. ఈ నేపథ్యంలో ఈ ఒంటిమిట్ట రామాలయం ఎంతో చారిత్రకప్రాధాన్యత సంతరించుకుంది.

విద్వాన్ కట్టానరసింహులు ఈ ఆలయవిశేషాలతో ఇటీవల ఒక మంచి పుస్తకం రచించారు. ఆయన రచించిన ఒంటిమిట్ట 'రామయ్యచరిత్ర'లో ఆలయానికి సంబంధించిన పురాణవిశేషాలు, చారిత్రకవిశేషాలు, ఆలయనిర్మాణం, శిల్పవిశేషాలు ఆసక్తికరంగా చోటుచేసుకొన్నాయి. ఆలయాన్ని ఆశ్రయించి తరించిన భక్తుల విశేషాలు, కవులు - వారి రచనలను గురించిన చాలా సమాచారం ఈ పుస్తకం అందిస్తూ ఉంది.

ఈ పుస్తకం చదువరుల కంటికి, మనసుకు ఇంపుగా ఉంది. ఈ పుస్తకంలోని పలువిషయాలు ఆసక్తికరంగా ఉన్నాయి. ఆర్టుపేపరు, రంగులబొమ్మలతో రమణీయమైన ఈ పుస్తకం ఒంటిమిట్టనుగురించి తెలుసుకోవాలనుకొన్న భక్తులందరికీ ఉపయోగకారి.

**- డా॥ కె.రాధారమణ**

కన్ను అర్పించి 'కన్నప్ప' అయ్యాడు. ఇది భక్తుని పేరేకాదు. భక్తికి పేరు.

'తిన్నడు' కథను సంస్కృతంలో రచిస్తూ ఉపమన్యు మహర్షి 'ధీరుడు' అని పేరు పెట్టాడు. 'తిన్నడు - ధీరుడు - కన్నప్ప', ఈ మూడుపేర్లూ భక్తిలక్షణాలే!

**:: 04 - సమాధానాలు ::**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 సం | వ | 2 ర | ణ | 3 డు | | 4 వి | వ | 5 శ |
| పా | | ణం | | ము | | ద్య | | తా |
| 6 తి | రు | | 7 చె | వు | లు | | 8 గా | నం |
| | | 9 శ్రా | | లు | | 10 కై | | దు |
| 11 వి | భా | వ | రి | | 12 వ | శి | ష్ఠ | డు |
| శ్వా | | ణం | | 13 త్రి | | కి | | |
| 14 మి | ధ్య | | 15 త | ప | తి | | 16 ద | 17 య |
| త్తు | | 18 య | | థ | | 19 ఆ | | ము |
| 20 డు | యు | గ | | 21 గ | జా | న | ను | డు |

అటూ ఇటూ వంకరలు పోని ఏకాగ్రతయే 'తిన్నని' తనం, చెక్కుచెదరని పట్టుదలే 'ధీరత్వం', మనోదృష్టిని చెదర నీయకుండా సర్వమూ శివమయమేనని దర్శించడమే కన్నును (దృష్టిని) అప్పగించడం - అదే 'కన్నప్ప' లక్షణం.

బుద్ధినీ, అహంకారాన్నీ, శారీరకకర్మల్నీ, ఏకాగ్రంగా శ్రద్ధగా సర్వసమర్పణభావంతో శివాంకితం చేసేవాడు లౌకికంగా ఎంతటి అల్పునివలె గోచరించినా, శివునిదృష్టిలో వాడే మహాను భావుడు.

శంకరభగవత్పాదులు 'శివానందలహరి'లో కేవలం కన్నప్పనే మహాభక్తునిగా ప్రస్తుతిస్తూ 'వనచరో భక్తావతం సాయతే' అని పేర్కొన్నారు.

శ్రీకాళహస్తి అచ్చమైన భక్తితత్త్వాన్ని ప్రబోధించే అద్భుత క్షేత్రం. శ్రద్ధ కలిగిన భక్తిని చేరదీసే కరుణాళువు సదాశివుడు.



పుట్టగానే...
పరిమళించిన
భక్తికుసుమం

2

# శ్రీ జనాబాయి

-డా॥ పోరంకి దక్షిణామూర్తి

**పాండురంగ విఠ్ఠలుని దర్శనార్థం పండరీపురం వచ్చిన ఒక కుటుంబంలోని బాలిక జనాబాయి.**

**స్వామివారి దర్శనానంతరం తిరిగి తమ ఊరు వెళ్లిపోదామంటే ససేమిరా వద్దన్నది జనాబాయి. అంతలో ఒక ముత్త యిదువ వాళ్లు ఉన్నచోటికి వచ్చింది.**

**జనాబాయిని పొదివిపట్టుకుని "పాపా! దేవుణ్ణి బాగా చూశావా!" అని అడిగింది. జనాబాయి తల అడ్డంగా తిప్పింది.**

**ఆ తర్వాత.....**

"అలాగా! ఇంకా ఇక్కడ ఉండాలని చిట్టితల్లి ముచ్చటపడుతోంది కాబోలు పాపం! ఉండండి ఇంకొన్నాళ్ళు, ఏం పోయింది?" అనింది - పెద్దావిడ.

"ఇంకా ఉండాలంటే ఎలా వీలవుతుందండీ? ఊళ్ళో పనులు పాడయి పోవూ?" అన్నాడు- పిల్లతండ్రి.

"అదీ నిజమే బాబూ!" అంటూ జనాబాయివైపు తిరిగి "పాపా! వెళ్లనంటే ఎలాగమ్మా? అమ్మా, నాన్నా వెళ్ళిపోతున్నారు కదా!" అనింది - పెద్దావిడ.

"అందరికీ అమ్మా నాన్నా ఇక్కడే ఉంటారు కదా!" అనింది- జనాబాయి. తెల్లబోయింది పెద్దావిడ. "మా అమ్మే! మా తల్లే!" అంటూ జనాబాయిబుగ్గలమీద ముద్దులు కురిపించింది. చిట్టితల్లి కున్నపాటి తెలివి పెద్దవాళ్ళకు మనకు లేదర్రా! రుక్మిణీపండరినాథులే అందరికీ తల్లీ తండ్రీనట! చూశారా!" అంటూ బుగ్గలు నొక్కుకుంటూ నవ్వింది.

"ఇదంతా వాళ్ళమ్మ నేరిప్పెట్టింది!" అన్నాడు- తండ్రి.

"గురి అన్నేది దానంతట అది కుదరాలి కాని, నేర్పితే వచ్చేదా బాబూ? అది పూర్వజన్మసుకృతం! అందరికీ రమ్మంటే రాదు- అది." అనింది- ఆవిడ. "పోనీ ఓ పని చెయ్యండి. నేనింకో పదిరోజులో. పదిహేనురోజులో ఇక్కడే ఉందా మనుకుంటున్నాను. చిట్టితల్లి ఇక్కడుండాలని సంబరపడుతోంది కనక, నా దగ్గర ఉంచండి. మీరు వెళ్ళండి. నేను వచ్చేటప్పుడు నాతోబాటు వస్తుంది. సరేనా పాపా?" అని అడిగింది. పాప ఉలుకూ, పలుకూ లేకుండా తల పక్కకు తిప్పేసి, కదలనని మొండికేసింది.

తల్లీ, తండ్రీ నయానా భయానా ఎంత నచ్చజెప్పడానికి ప్రయత్నించినా జనాబాయి తనపట్టు విడవలేదు. ఇంక లాభం లేదనుకున్నారు- వాళ్ళు. పెద్దావిడ చెప్పినట్టే చెయ్యడం మంచిదనుకున్నారు. కూతుర్ని ఆవిడకు అప్పగించి, తమ ఊరికి బయలుదేరారు.




వాళ్ళు అటు వెళ్ళగానే జనాబాయి పండరినాథుడిగుళ్ళోకి ఉరికింది. "ఉండు పాపా! నేనుకూడా వస్తున్నాను కదా!" అంటూ వెనకాలే వెళ్లింది- పెద్దావిడ మెల్లమెల్లగా.

ఇలా ఎప్పుడనుకుంటే అప్పుడు - పొద్దుటి పూట గుడి తలుపు తెరిచింది మొదలు, రాత్రి తలుపులు మూసేవరకు - గుళ్ళోకి దూరి పాండురంగడి దివ్యమంగళవిగ్రహాన్ని కళ్ళప్పగించి చూస్తూ ఉండిపోయేది. కనురెప్పలు మూతపడితే పాండురంగడి నామస్మరణే చేస్తూ ఉండేది. గుళ్ళో ఉన్నా, మంటపంలో కూర్చున్నా, పాండురంగ

నామమే జనాబాయి పెదవులమీద కదలాడేది. పాండురంగ రూపమే ఆమె మనస్సులో నిండి ఉండేది. పాండురంగభజన మొక్కటే పొద్దస్తమానం ఆమెకు కావలసింది.

మామూలుగా పెద్దవాళ్ళ కన్నా- చిన్నవాళ్ళకు నిలకడ తక్కువ ఉంటుంది. ఒకచోట కుదురుగా కూర్చోలేరు. అటు వంటిది, జనాబాయి గంటలకు గంటలు కూర్చున్నచోటి నుంచి కదలకుండా- పాండురంగధ్యానంలో మునిగి ఉంటూండటం చూచి, పెద్దావిడ ఆశ్చర్యపోతూ ఉండేది. ఆకలిదప్పులు కూడా తెలిసేవి కావు-చిట్టితల్లికి. పెద్దావిడ ఎంతో శ్రమపడి ప్రయత్ని స్తేనే కాని జనాబాయికి బాహ్యస్పృహ వచ్చేది కాదు. యాత్రికు లందరూ వెళ్ళిపోయినా- పండరిపురంలో తానున్నది దైవధ్యానం కోసంకాక, జనాబాయి కాపుదలకోసమే ఉన్నట్టు అయింది పెద్దావిడకు. అదే ఆవిడకు ఆధ్యాత్మికసాధన అయింది. జనా బాయి మంటపంలో ఒకచోట ధ్యానంలో మునిగి ఉన్నంత సేపూ ఆవిడ ఏ స్తంభానికో చేర్లబడి నామజపం చేసుకుంటూ తనకు కుదరని ఏకాగ్రత ఈ చిట్టితల్లికి ఇంత త్వరగా ఎలా అలవడిందా అని, విడ్డూరంగా చూస్తూ ఉండేది.

ఒకనాడు నామదేవుడు పాండురంగడి ఆలయానికి దర్శనా నికి వచ్చాడు. ఆయన మహాభక్తుడు. వినయశీలి. భాగవతసేవా



పరాయణుడు. ఊరివారందరి మన్ననలకూ పాత్రుడైనవాడు. ఆయన ధ్యానంలో మునిగి ఉన్న జనాబాయిని చూచాడు. నడుస్తున్నవాడు నిలిచిపోయాడు. కొద్దిసేపు తదేకంగా చూచి, చిన్నగా నవ్వుకొని ముందుకు సాగిపోయాడు. ఆనాడు సాయంత్రం మళ్ళీ వచ్చాడు. అదే దృశ్యం కంటబడింది. అలా ఒకరోజు కాదు, రెండురోజులు కాదు, వరుసగా వారం రోజులపాటు ఆ చిట్టితల్లి ధ్యానదీక్షను చూచి, మురిసిపోయాడు. అక్కణ్ణించి కదలలేకపోయాడు.

నామదేవుడు మహాభక్తుడని పెద్దావిడకు తెలుసు. తాను కూర్చున్నచోటినుండి లేచి వచ్చి, ఆయనకు నమస్కరించింది. ఆయన ఆ చిట్టితల్లినిగురించి అడిగాడు. ఆవిడ చెప్పింది. "అమ్మాయి కారణజన్మురాలు. అంతా ఆ పాండురంగడి దయ!" అంటూ చేతులెత్తి పండరినాథుడికి నమస్కరించి వెళ్ళిపోయాడు.



ఇలా ఏర్పడ్డ పరిచయంతో నామదేవుడు చిట్టితల్లికీ, పెద్దా విడకూ సన్నిహితుడు అయ్యాడు. అప్పుడప్పుడు తన ఇంటికి తీసుకువెళ్ళి పండ్లు, భోజనం పెట్టి, భాగవతసేవగా తలచి సంతోషిస్తూ ఉండేవాడు.

*(ఇంకా ఉంది)*

మానవులందరూ ఆనందకరమైన, శాంతియుతమైన జీవనం గడిపేందుకు
మనపూర్వీకులు ప్రధానంగా ఋషులు అనేకనియమనిబంధనలు ఏర్పాటు చేశారు.
ఈ సృష్టిలో లభించే, జన్మించిన కొన్నింటిని జీవితానికి అనుసంధానం చేసి...
జీవనవిధానంలోనే ఆనందం, ఆయురారోగ్యాలు లభించేలా చేశారు.
మన సంస్కృతి, సంప్రదాయాలు ప్రపంచానికంతా మార్గదర్శకం అయ్యాయి.
మన సంస్కృతిలోని గొప్పవాటిని ప్రపంచమంతా ఈనాడు అనుసరిస్తూ ఉండడం విశేషం.
మన సంస్కృతిలో మిక్కిలి గొప్పవిగా.... జీవితంపై ప్రభావాన్ని చూపేవిగా...
భారతీయులకే సొంతమైనవిగా "రుద్రాక్షలు, సాలగ్రామాలు, తులసి, గోవు....." ఇలా ఎన్నో పేరు పొందాయి.
వాటిని గురించి, వాటివల్ల ప్రయోజనాలు, వాటిగొప్పతనంవంటివాటిని అందరికీ తెలియజేయడమే ఈ శీర్షిక ఉద్దేశం!




# రుద్రాక్షలు

భక్తులను అనుగ్రహించేందుకు రుద్రాక్షలు స్థావరాలుగా అవతరించాయి. వీటిని ధరించిన భక్తులకు ఏ రోజు చేసిన పాపాలు ఆ రోజే నశిస్తాయి. రుద్రాక్షలను దర్శించడంవల్ల లక్షజన్మల పుణ్యం, ధరించడంవల్ల కోటిజన్మలపుణ్యము లభిస్తుంది.

అంతటి మహిమగల 'రుద్రాక్షలు' మనదేశంలోనే కాకుండా - ఈనాడు విదేశాల్లో కూడా అత్యంతఆదరణను అందుకుంటున్నాయి. రుద్రాక్షధారణవల్ల జీవితంలో ఆధ్యాత్మికానందం, సుఖశాంతులు లభించడంతో పాటు-ఆయురారోగ్యాలు వృద్ధి చెందుతాయి. 'రుద్రాక్ష' అంటే శివుడి 'కన్నీటిబిందువు' అని అర్థం.



రుద్రాక్షలనుగురించిన ప్రస్తావన స్కాంద, పద్మ, లింగ, శివపురాణాల్లోనూ, శ్రీదేవిభాగవతం, శ్రీమద్భాగవతం, శ్రీగురుచరిత్రలతో పాటు 'జాబాలోపనిషత్తు'లోనూ ఉంది. వీటన్నింటిలోనూ రుద్రాక్ష పుట్టుక శివుడితో ముడిపడి ఉంది. పూర్వం త్రిపురాసురులు అనే ముగ్గురు రాక్షససోదరులు బ్రహ్మదేవుడి నుంచి వరాలు పొంది, దేవతలతో పాటు సకలలోకవాసులను హింసించసాగారు. దీంతో దేవతలు, మహర్షులు శివుడికి మొరపెట్టుకోగా శివుడు త్రిపురా సురులపై దండెత్తి, వారిని భస్మం చేశాడు. ఈ సమయంలో శివుడి కంటినుండి నీటి బిందువులు జారి, భూమిమీద పడి, అవి రుద్రాక్ష వృక్షాలు అయి-రుద్రాక్షలను ఇచ్చినట్లు పురాణాల్లో చెప్పబడింది.

## వివిధవర్ణాలు

రుద్రాక్షలు రకరకాలైన రంగుల్లో లభ్యమవుతాయి. ప్రధానంగా తెలుపు, తేనె, నలుపురంగులతో పాటు మిశ్రమరంగుతో రుద్రాక్షలు లభ్యమవుతాయి. త్రినేత్రుడైన శివుడి సూర్యనేత్రంనుండి కపిలవర్ణంలో పన్నెండురకాలు, చంద్రనేత్రం నుంచి తెలుపువర్ణంలో పదహారు రకాలు, అగ్నినేత్రంనుండి నలుపువర్ణంలో పదిరకాలు అంటే - మూడు కన్నులనుంచి ముప్పైఎనిమిదిరకాల రుద్రాక్షలు వెలువడ్డాయి.

## ఏకముఖిరుద్రాక్ష

శివస్వరూపంగా చెప్పబడే ఏకముఖిరుద్రాక్ష అర్ధ చంద్రాకారంలో ఉంటుంది. దీన్ని ధరించే సమయంలో – *'ఓం ఐం హ్రం ఔం ఇం ఓం'* అనే మూలమంత్రాన్ని పదకొండుసార్లు పఠించాలి. ప్రతిసంవత్సరం చైత్రమాసంలో సోమవారంనాడు ఈ రుద్రాక్షను 108 ఎర్రనిపూలతో పూజిస్తూ –

**శ్రీగణపతి దేవాయనమః**
**ఓం హ్రీం శ్రీం క్లీం ఏకముఖిభగవతే అనురూపాయ**
**సర్వయుగేశ్వరాయ త్రైలోక్యామాత్యాయ**
**సర్వకామఫలప్రదాయ నమః ॥**

– అనే మంత్రాన్ని పఠించాలి.

ఈ రుద్రాక్షను ధరించడంవల్ల సిరిసంపదలు వృద్ధి చెందడంతో పాటు ఇంద్రియనిగ్రహం కలుగుతుంది. మనోవికాసం, పరతత్వజ్ఞానం లభిస్తాయి.

## ద్విముఖిరుద్రాక్ష

శివపార్వతీరూపంగా, అర్ధనారీశ్వరరూపంగా చెప్ప బడే దీనిని గురుపూర్ణిమ, దత్తజయంతిరోజుల్లో గానీ, కార్తికమాసంలో గురుశుక్రవారాల్లో గానీ, ధరించాలి. ధరించే సమయంలో – *"ఓం క్షీం హ్రీం, క్ష్రాం, వ్రీం, ఓం"* అనే మూలమంత్రాన్ని పదకొండుసార్లు పఠించాలి. దీన్ని ధరించడంవల్ల వ్యాపారాభివృద్ధి జరుగుతుంది. సంతాన ప్రాప్తి కలుగుతుంది. కోరికలు నెరవేరుతాయి. మనశ్శాంతి కలగడంతో పాటు కుండలినీశక్తిని మేలుకొలుపుతుంది.

## త్రిముఖిరుద్రాక్ష

మూడుముఖాలున్న ఇది త్రికాలాగ్నుల స్వరూపం. దీన్ని సుబ్రహ్మణ్యషష్ఠి, నాగపంచమి, గురువారంరోజులలో ధరించాలి. ధరించేసమయంలో *"ఓం క్లీం నమః"* అనే మంత్రాన్ని 108 సార్లు పఠించాలి. దీన్ని ధరించడంవల్ల సంపద, విద్యాభివృద్ధులు కలుగుతాయి. దగ్గు, ఆయాసం, మలేరియా, గుండెజబ్బులు, పచ్చకామెర్లువంటి వ్యాధులు తగ్గడంతో పాటు– జీర్ణక్రియ పెరుగుతుంది. కుజదోషం ఉన్నవారు దీన్ని ధరించడం మంచిది.




## రుద్రాక్షలు – ముఖాలు

**ముప్పైఎనిమిదిరకాల రుద్రాక్షలవరకు ఉన్నట్లు పురాణాల్లో చెప్పబడినప్పటికీ, పండితులు 21 ముఖాలు ఉన్న రుద్రాక్షలు మాత్రమే ఉన్నట్లు చెప్తారు. మొత్తంమీద పరిశీలిస్తే ప్రస్తుతం ఒకటి నుంచి పదునాలుగుముఖాలు కలిగిన రుద్రాక్షలు లభ్యమవుతూ ఉన్నాయి. వీటిల్లో ఒక్కొక్కదానికి ఒక్కొక్క లక్షణం ఉంటుంది. వీటిని ధరించడంవల్ల వివిధఫలితాలు లభిస్తాయి.**



# రుద్రాక్షధారణ - నియమాలు

- సరైన రూపంలో లేని రుద్రాక్షలు, ముల్లులేని రుద్రాక్షలు, పురుగులు తిన్న, పాడైపోయిన రుద్రాక్షలను ధరించరాదు.
- బంగారు, వెండి, రాగి తీగెలతో లేదా శిల్కుదారంతో రుద్రాక్షలనుగూర్చిన మాలలను ధరించాలి.
- రుద్రాక్షలు ధరించినవారు వాటిని ఎల్లవేళలా పరిశుభ్రంగా ఉంచాలి.
- రాత్రివేళలో రుద్రాక్షలు ధరించరాదు. పొరపాటున ధరిస్తే వాటిని ఆవుపాలతో శుద్ధి చేయాలి.
- రుద్రాక్షమాలను ధరించేవారు సంవత్సరానికి ఒక్కసారైనా దానికి మహాన్యాసపూర్వకఏకాదశరుద్రాభిషేకం చేయాలి.
- రుద్రాక్షలు ధరించి ధూమపానం, మద్యపానం చేయడం, మాంసాహారం భుజించడం చేయరాదు.
- వివిధరకాలైన సమస్యలు, వ్యాధులతో బాధపడేవారు పండితుల సలహామేరకు ఆయా ముఖాల రుద్రాక్షలను ధరించడం మంచిది.

### చతుర్ముఖిరుద్రాక్ష

బ్రహ్మదేవునిస్వరూపంగా చెప్పబడే నాలుగు ముఖాలున్న దీన్ని గురుపూర్ణిమ, దత్తజయంతిగానీ, బుధవారంగానీ ధరించాలి. ఈ సమయంలో *"ఓం వాం క్రాం తాం హాం ఈం"* అనే మంత్రాన్ని పదకొండుసార్లు పఠించాలి. మందబుద్ధి ఉన్నవారు, జ్ఞాపకశక్తి తక్కువ ఉన్నవారు దీన్ని ధరించడం మంచిది. ఈ రుద్రాక్షను పాలలో వేసి కాచి, ఆ పాలను 21 రోజులపాటు త్రాగినట్లయితే బుద్ధివికాసం, జ్ఞాపకశక్తి, మానసికప్రశాంతత కలుగుతాయి.

### పంచముఖిరుద్రాక్ష

కాలాగ్నిస్వరూపమైన ఐదుముఖాల రుద్రాక్ష సులభంగా లభిస్తుంది. దత్తజయంతి, గురుపూర్ణిమ, శివరాత్రి పండుగ రోజుల్లో గానీ, సోమవారంగానీ *"ఓం హ్రీం ఆం క్ష్మ్యాం స్వాహా"* అనే మంత్రాన్ని పదకొండుసార్లు పఠించి ధరించాలి. రక్తపోటు, గుండెసంబంధవ్యాధులు నయంచేసే శక్తి ఉన్న దీన్ని నీటిలో ఉంచి, ఆ నీటిని త్రాగితే రక్తం శుద్ధి అవుతుంది. దీన్ని ధరించడంవల్ల మానసికప్రశాంతత కలుగుతుంది.

### షణ్ముఖిరుద్రాక్ష

శ్రీసుబ్రహ్మణ్యస్వామి ప్రతి రూపమైన ఆరుముఖాలున్న దీన్ని వినాయకచవితి, సుబ్రహ్మణ్యషష్ఠి పండుగరోజుల్లో లేదా మంగళవారంరోజు ధరించాలి. ఇది ధరించే సమయంలో *"ఓం హ్రీం శ్రీం క్లీం సాం ఐం"* అనే మంత్రాన్ని పదకొండుసార్లు పఠించాలి. దీన్ని ధరించినవారు మంచివక్తలుగా పేరు పొందుతారు. హిస్టీరియా, గుండెదడవంటి వ్యాధులు తగ్గిపోతాయి.

### సప్తముఖిరుద్రాక్ష

మన్మథస్వరూపమైన ఏడుముఖాలున్న దీనికి 'అనంగము' అని పేరు. దీన్ని దీపావళినాడు లేదా శుక్రవారం, శనివారాల్లో ధరించవలెను. *"ఓం హ్రీం, క్లీం గ్లేం హ్రీం సాం"*

అనే మంత్రాన్ని పదకొండుసార్లు పఠించి ధరించాలి. ఏలినాటి శనిదశలో ఉన్నవారు దీనిని ధరించడం మంచిది.

## అష్టముఖిరుద్రాక్ష

ఎనిమిదిముఖాలున్న ఇది వినాయకుడిస్వరూపం. *"ఓం హ్రీం నమః"* అనే మంత్రాన్ని పదకొండుసార్లు పఠించి వినాయకచవితి లేదా ఆది వారంనాడు ధరించాలి.

దీన్ని ధరించడం వల్ల అన్ని విఘ్నాలు తొలగి పోయి కార్యానుకూలత కలుగుతుంది. మనశ్శాంతి, ఏకాగ్రత, విద్యాభివృద్ధి, జరుగుతాయి.

పక్షవాతం వచ్చిన వారువీటిని ధరించినట్లయితే మంచి ఫలితాలు ఉంటా యని వైద్యశాస్త్రవేత్తల అభి ప్రాయం.

## నవముఖిరుద్రాక్ష

భైరవస్వరూపంగా ఉండే తొమ్మిదిముఖాలున్న దీన్ని ధరించడంవల్ల విద్య, జ్ఞాన, క్రియ, శాంత, వామ, జ్యేష్ఠా, రేధి, అంగ, పశ్యంతీ అనే నవశక్తులకు ప్రతీకగా పూజలందుకునే దుర్గాదేవి ఈ రుద్రాక్షకు అధిదేవత.

దీనిని నవరాత్రులలోగానీ, శుక్రవారంగానీ *"ఓం క్లీం హ్రూం నమః"* అనే మంత్రాన్ని పదకొండుసార్లు పఠించి ధరించాలి. దీన్ని ధరించడంవల్ల వాక్పటిమ వృద్ధి చెందడంతో పాటు చర్మవ్యాధులూ నిర్మూలింపబడతాయి.

## ఆరోగ్యదాయకం!

**మనిషికి వచ్చే వివిధ వ్యాధులను నయం చేసే లక్షణాలు రుద్రాక్షలకు ఉన్నట్లు ఆయుర్వేదం చెబుతోంది. ప్రధానంగా రక్త పోటు, మధుమేహం, గుండెసంబంధ వ్యాధులు, గజ్జి, తామర, చర్మవ్యాధులు, మూర్ఛ, గొంతువాపు, జలుబు, కడుపునొప్పి, అజీర్ణం, కీళ్లవాతం, శ్వాసకోశవ్యాధులు, కుష్టు మొదలైన వ్యాధుల నివారణలో రుద్రాక్షలు ఉపయోగపడుతాయి. అయితే వైద్యుని సలహామేరకు ఉపయోగించాలి.**

**రుద్రాక్షలను గురించి పరిశోధనలు జరిపిన ఆస్ట్రేలియా శాస్త్రవేత్త అల్లాన్ సమ్మర్స్ - *"రుద్రాక్షమాలను శిరస్సు చుట్టూగానీ, మెడలో గానీ ధరించిన వ్యక్తి శరీరంపైన తీవ్రమైన ప్రభావాన్ని కలిగిస్తుంది. రక్తపోటు సామాన్యస్థితికి చేరుతుంది. తలనొప్పి, శరీరనొప్పులు తగ్గుతాయి. మూర్ఛరోగం తగ్గిపోతుంది. ప్రధానంగా హిమాలయ ప్రాంతాల్లో లభించే రుద్రాక్షల్లో అత్యుత్తమ రోగ నిరోధకశక్తులు ఉన్నాయి"* అని పేర్కొన్నాడు.**

## దశముఖిరుద్రాక్ష

విష్ణుస్వరూపమైన దీనిని *"ఓం హ్రీం నమః"* అనే మంత్రాన్ని పదకొండుసార్లు పఠించి ఏకాదశిరోజుల్లో ధరించాలి. దీన్ని ధరించడంవల్ల భూత, ప్రేత, పిశాచ, గ్రహపీడలు తొలగి పోతాయి. ఈ రుద్రాక్షను తెల్లని వేడిపాలలో కొంతసేపు వేసి ఆ పాలను త్రాగడంవల్ల కోరింతదగ్గువంటివ్యాధులు నయం అవుతాయి.

## ఏకాదశముఖిరుద్రాక్ష

రుద్రస్వరూపంగాను, వీరభద్రస్వరూపంగాను భావించే పదకొండు ముఖాలు ఉన్న దీనిని *'ఓం హ్రీం హ్రూం నమః'* అనే మంత్రాన్ని పదకొండుసార్లు చదివి శివరాత్రిరోజు లేదా సోమవారాల్లో ధరించాలి.

స్త్రీలు దీన్ని ధరించడం వల్ల సౌభాగ్య, సంతాన వృద్ధి కలుగుతుంది.

దీనిధారణవల్ల ధైర్యం, సంపద, జ్ఞానం వృద్ధి చెందుతాయి.

## ద్వాదశముఖిరుద్రాక్ష

పన్నెండు ముఖాలు కలిగిన ఈ రుద్రాక్ష శ్రీమహావిష్ణువు స్వరూపం. దీనిఅధిపతి శ్రీసూర్యభగవానుడు. దీన్ని రథసప్తమి నాడుగానీ, ఆదివారంనాడు గాని ధరించాలి. ధరించేందుకు దీన్ని చేతిలో ఉంచుకుని "ఓం ఘృణిశ్రీం" అనే మంత్రాన్ని 108సార్లు పఠించి, అనంతరం *"ఓం క్రీం క్షాం రౌం నమః"* అనే మంత్రాన్ని 11 సార్లు చెప్తూ ధరించాలి.



## నకిలీ రుద్రాక్షలు గుర్తించే మార్గం

రుద్రాక్షలు అనేకం నకిలీవి ఉన్నాయి. నకిలీరుద్రాక్షలు కనుగొనేందుకు ఈ క్రిందిపరీక్షలను చేయవచ్చు.

- రెండురాగి రేకుల మధ్య రుద్రాక్షను ఉంచితే దానికై అదే సవ్యదిశలో తిరుగుతుంది.
- ఒక గిన్నెలో నీరుపోసి, అందులో రుద్రాక్ష వేసినట్లయితే, అది ఒరిజినల్ అయితే మునుగుతుంది. నకిలీవి తేలుతాయి. పాతవయ్యే కొద్దీ బరువు తగ్గి, నీటిలో మునిగే తత్త్వాన్ని కోల్పోతాయి.
- నీటిలో వేసినపుడు రంగు వెలిస్తే అది నకిలీరుద్రాక్ష.
- నీటిలో ఒక అరగంట వేస్తే, ఆ నీరు వేడి ఎక్కితే అది ఒరిజినల్ రుద్రాక్ష.
- పాలలో రుద్రాక్షను వేస్తే-ఆ పాలు విరిగిపోవు. చెడిపోవు.

ఈ విధమైనపరీక్షలను నిర్వహించి, నకిలీలను గుర్తించవచ్చు.

దీన్ని ధరించడంవల్ల మానసికశాంతి, ఇంద్రియ నిగ్రహం కలుగుతుంది. ఇది ఏకముఖిరుద్రాక్షతో సమానమైన శక్తి కలది.

### త్రయోదశముఖిరుద్రాక్ష

ఇంద్రుడి స్వరూపంగా చెప్పే పదమూడుముఖాలు ఉన్న దీన్ని సుబ్రహ్మణ్యషష్ఠి, నాగపంచమి దినాల్లోగానీ, మంగళ వారంనాడు గానీ ధరించాలి. దీన్ని ధరించే సమయంలో **"ఓం హ్రీం నమః"** అనే మంత్రాన్ని పదకొండుసార్లు పఠించాలి.

దీన్ని ధరించడంవల్ల చేపట్టిన పనులు విజయవంతం కావడంతో పాటు అందరినీ ఆకట్టుకునే శక్తి లభిస్తుంది.

### చతుర్ధశముఖిరుద్రాక్ష

పదనాలుగు ముఖాలు కలిగిన ఈ రుద్రాక్షను శివుని స్వరూపంగా, హనుమంతుడికి ప్రతీకగా చెప్పారు. దీన్ని శివరాత్రి, హనుమజ్జయంతి రోజులలో గానీ, సోమవారం లేదా మంగళవారంగానీ ధరించాలి. దీన్ని ధరించే సమయంలో ***"ఓం నమః, ఓం నమః శివాయ"*** అనే మంత్రాలను పదకొండు సార్లు పఠించాలి. దీన్ని ధరించడంవల్ల సర్వరోగాలు నశిస్తాయి.

**ఈ విధంగా ఆయురారోగ్యాలను ప్రసాదించే**
**రుద్రాక్షలను గురించి తెలుసుకోవడం,**
**దర్శించడం, ధరించడం**
**కూడా ఆధ్యాత్మికఆనందమే!**



